

పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త :- విశ్వాత్ముల నరసింహమూర్తి



"మంత్రివరా! నీ విప్పుడు చెప్పిన దంతయు బాగున్నది కానీ, శత్రువొకడు మన నగరము మీదికి దండు వెడలగా మనమందరము దీర్ఘాలోచనలేన్నో చేయుచు ఏమరుపాటున వుండ తగదు! మన ఆలోచన ముగియునప్పటికి మన పురమన్యాక్రాంతంబగును!!"



"వచ్చిన ఆపద తొలగించుకొని హిరణ్యగర్భుని సంగతి చూచెద. మహాబలుని ఉక్కడగించుటకేదైనా ఒక యోచన చెప్పుము!"



"ఆనాడెపుడో హిరణ్యగర్భుని ఓడించితిమని గర్వపడకుడు. ఆ రోజున మన సైన్యములోని బలవంతులునేడొక్కరు లేరు! ఇట్టి సైన్యమును సమకూర్చుకొని ఆ మహాబలునితో పోరుకు వెడలిన పరాభవము పొందుట నిజము!"



"హిరణ్యగర్భుని ప్రేరణ చేతనె మహాబలుడూ దాడి చేసెను. ప్రాణమిత్రుని తృప్తికోసమే మన నగరమునూ ముట్టడించెను.



"కావున నిప్పుడు హిరణ్యగర్భుని మనోరథం బెడెరినచో మహాబలుడునూ సంతుష్టుండై మన నగరమునూ విడిచిపోవును! కావున ఓ మహాప్రభూ, హిరణ్యగర్భుని కడకొక దూతను మహాబలునికి మరియొక దూతను రాయబారులుగ పంపివేయుడు!"



చిత్రవర్ణుడూ యోచించేసి- మంత్రివుపాయమె సముచితమనెను:-

దూరదర్శియు అనుమతి పొంది అరుణముఖుని పిలువనంపెను.



అరుణముఖుడు వచ్చినిలువ మహాబలునితోడ అతడు చెప్పవలసిన మాటలన్ని దూరదర్శి బోధించి కార్యమును సాధించుమనీ చెప్పి అతని పంపివేసె.



వేగముగా అరుణముఖుడు మహాబలుడు విడిసియున్న ప్రదేశమును సమీపించె.



అచటవున్న భటులతోడ తన కార్యమును వివరించి సేనావాహిని దాటెను.



చందన తరు లతాగృహమున విడిసియున్న మహాబలుని సన్నిధికి చేరి నిలచె

"ప్రభూ! చిత్రవర్ణ మహారాజు దేవరకొక్క వార్త పంపె.....



'ఇరుగుపొరుగు రాజులము:- జగడములాడుట తగదు.- ఐకమత్యమున మెలగినచో- ముల్లోకము లెత్తివచ్చినా- మనమంతా గెలువగలము. -పూర్వమొకప్పుడు పోరుకు తలపడి-ఇరు పక్షములా నష్టపడితిమి- కావున ఓ మహాబలుడా!- మైత్రి నెరపుదము...



కర్పూర ద్వీపాధీశుడు- హిరణ్యగర్భుడు మన కొరుపు రకు-ప్రాణసఖుడు కాతగిన వాడు.- ఆతని రాజ్యము యిచ్చివేసెద నని- మాతో సఖ్యము నెరపుమనీ- చెప్పుటకిప్పుడె దూతను పంపెద.' అని పలికెను మా చిత్రవర్ణుడు."



సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.

# ఆంధ్రపత్రిక

సచిత్రవారపత్రిక

Founder : K. NAGESWARA RAO

సంపుటము 47
సంచిక 24
24.2-54

విజయ మాఘ బహుళ షష్ఠి బుధవారం



మధ్యాహ్నం పాఠాలు

ఫొటో : కె. వి. శివరామశాస్త్రి - కోలావార్క్స్.

"హర్తకు గాదు గోచరః –
మహర్నిశమున్ సుఖపుష్టి సేయుః – స
త్కీర్తి, ఘటించుః – విద్యయను
దివ్యధనం బఖిలార్థికోటికిం
బూర్తిగ నిచ్చినన్, బెరుగు,
బోదు, యుగాంతపు వేళనైనః – భూ
భర్తలు తద్ధనాధికుల
పట్టున గర్వము మాను టొప్పగున్."

తా॥ విద్యయను దివ్యధనం దొంగకు కని పించేదికాదు. అది ఎల్లప్పుడూ సౌఖ్యాభి వృద్ధిని కలుగజేయును. మంచి కీర్తిని చేకూర్చును. ఈ విద్య యనబడు దివ్యధనమును కోరినటువంటి సమస్త జనులకు దానిని పూర్తిగా పంచియిచ్చినప్పటికీ, అది ఇంకా వృద్ధియగును. కాని ప్రళయకాలమందు కూడా నశించదు. కనుక, అటువంటి విద్యాధనాధిపతులైనవారియెడల, భూ పతులు అనగా రాజులు గర్వము మాని ప్రవర్తించుట యుక్తము.

విద్య అనేదికూడా ధనమువంటిదే అని ముందుగా మాటవరుసకు అంగీకరించి అటు పిమ్మట, ధనముకంటె విద్య ఎక్కువైనదని నిర్ధారణ చేయడం ఎందుకు? అనే ప్రశ్నకు ముందుగా జవాబు చెప్పక తప్పదు. "భూ




భర్తలు తద్ధనాధికుల పట్టున గర్వము మాను టొప్పగున్" అని పద్యం ముగింపబడింది. రాజులుగాని, దేశాధిపతులుగాని, ప్రభుత్వాధిపతులుగాని ఖజానా చేతిలో ఉంచుకొని పండితజనాన్ని కూడా పామర జనంతో పాటు శాసించి,తమ అధికారాన్ని చలాయించి, విద్యలను విద్యాశాలలను తమ అధికారం సాగించడానికి వీలైన ప్రభుభక్తిభజనమందిరాలుగా చేయడం యుగయుగాలనుంచీ, తరతరాలనుంచీ అమలులో ఉంది. అందుచేత ప్రభుత్వాధిపతులయిన వారు విద్యాధిపతులైనవారిమీద తమ అధికారం చలాయించకుండా విద్యకూ,విద్వాంసులకూ, విద్యాసంస్థలకూ కొంత స్వేచ్ఛను స్వాతంత్ర్యాన్ని యిచ్చి గౌరవించాలి. అటువంటి స్వేచ్ఛను విద్వాంసులైనవారికి విధిగా యివ్వాలి. అంతేకాదు. ధనాధిపతులైన ప్రభుత్వాధిపతులు ఎటువంటి ప్రజాశాసనకర్తలో, ఎటువంటి "జనగణమన అధినాయ"కులో, మహావిద్వాంసులుకూడా అటువంటి "జనగణమన అధినాయకు"లని అంగీకరించాలి. కేవలము నమానహోదాయి సేచాలదు. ప్రభుత్వాధిపతులకంటె, విద్వాంసులకు అధిక గౌరవం యివ్వాలి. ఇది ప్రభువులకు శ్రేయస్కరమైన శ్రేష్ఠమైన ధర్మం – ప్రజా శ్రేయస్సును కోరేటటువంటి శ్రేయోరాజ్యంలో అటువంటిపద్ధతి పరమోత్కృష్ట వథకమని, ప్రభుత్వం అంగీకరించాలి. ఆవిధంగా ప్రభుత్వం వ్యవహరించకపోతే—

విద్యాపద్ధతిలో గాని, విద్యాశిక్షణలో గాని, విద్యా విజ్ఞాన వికాసంలో గాని స్వాతంత్ర్యం ఉండదు. సత్యాసత్యమధనమును, ధర్మాధర్మమధనమును తత్వవేత్తలు స్వేచ్ఛగా చేయడానికి అవకాశం ఉండదు. విశ్వవిద్యాలయపీఠములందు అనేకశాస్త్రము అలో మహావిద్వాంసులు ధర్మమీమాంస చేస్తూఉండాలి. మానవకోటికి ఏది మంగళప్రదమైన ధర్మమార్గమో నిర్ణయించాలి. ప్రభుత్వము అనుసరిస్తున్న వ్యవహారపద్ధతులు కూడా చెడ్డమార్గం అనుసరిస్తూఉన్నట్లయితే, నిర్మొగమాటంగా అట్టి ప్రభుత్వపద్ధతులను విమర్శించి ఖండిస్తూ సవ్యమైన రాజ్యాంగ ధర్మమేదో ఆ విశ్వవిద్యాలయ విద్వాంసులు తమశిష్యులకు బోధించడానికి అధికారం కలిగిఉండాలి. స్వేచ్ఛకలిగిఉండాలి. అంతే గాని, ప్రభుత్వమువారు ఏ పద్ధతి అనుసరిస్తున్నారో అదే ప్రశస్త అవశ్యకర్తవ్యం అని బోధించడమున్నూ, దానివల్ల దేశానికి నష్టమైనా కష్టమైనా అవశ్యమనుభోక్తవ్యం అని బోధించడమున్నూ, విశ్వవిద్యాలయములయొక్క డ్యూటీ అయినట్లయితే, ఆ డ్యూటీని తప్పి ఆ విశ్వవిద్యాలయములు వ్యవహరించినట్లయితే, ఆ విశ్వవిద్యాలయములకు కొలబుద్రగా యివ్వబడుచున్న ద్రవ్యసువారం(గ్రాంటు)మంజూరు చేయబడదు. మళ్లీమళ్లీ "వన్సుమోర్"అంటే "ముయ్యి నోర్!" అంటారు అధికారులు. విశ్వవిద్యాలయాలు మూలపడతాయి. విద్యాలయాలలో విద్య లయమవుతుంది. విద్యాలయాధికారులు, విద్యను లయంచేసే అధికఅరు లవుతారు. దీనినిబట్టి విదితమవుతున్న ప్రధితవిషయం ఏమిటంటే విశ్వవిద్యాలయాలకు ప్రభుత్వం ధనసహాయం చేసి పోషిస్తోంది గనుక, విద్యాపీఠములు ప్రభుత్వపోషణలో ఉంటున్నవి గనుక, విద్యాలయములు లయ తప్పకుండా ప్రభుత్వానికి ప్రక్క తాళం వేయవలసిఉంటుంది. ప్రొఫెసర్లుకూడా జీతబత్తెములతో జీనుకట్టిన గుర్రాలవలె కదను త్రొక్కుతూ గుర్రాళ్ళకు శిక్షణ యివ్వాలి. ఇటువంటి అన్యోన్యాశ్రయ పద్ధతి యెందుమూలంగా ఏర్పడిందంటే, ప్రభుత్వాధిపతులకున్నూ, విద్యాధిపతులకున్నూ మధ్య ధనం అనబడే లంకె ఒకటి ఉండడంవల, గ్రాంటులు యిచ్చేది ప్రభుత్వం అవుతోంది; గ్రాంటులు పుచ్చుకొనేది విద్యాపీఠం అవుతోంది. వారి కరంబు మీ దగుట, వీరికరంబు క్రిం దగుట

విషయానుక్రమణిక

ముఖచిత్రం :—"ప్రిజనర్ అఫ్ గోల్కొండ"లో బీనారాయ్.

# అనిత్యవస్తు విచారము



నండూరి రామమోహనరావు

జనపదములకుగాని
వన పథములకుగాని
ఏడాది కొకమారె
ఏతెంచు చైత్రమ్ము

పూర్వాదిక్తటమందు
పూర్ణేందు బింబమ్ము
మాసమున కొకసారి
మాత్రమ్మె భాసించు.

ఐన, కాలమనంత
మవని విపులము గాన,
ఎన్ని చైత్రము లెన్ని
పున్నమల్ భువి నిండె!

కాని, జీవనవరము
మానవున కొకమారె!
జీవనమ్మొకమారె
యౌవనతరళితమ్ము!
హృదయమందొకపరియె
ప్రేమ వెల్లువ పొంగు!
ఏ యొకటి నీవు కో
ల్పోయినను, మరిరాదు.

వల్ల ప్రభుత్వమువారిది పైచెయ్యిగాను, ద్రవ్యదానం స్వీకరించేటటువంటి విద్యాపీఠమువారిది క్రిందిచెయ్యిగాను ఉంటోంది. ఈవిధంగా వారిచేతిక్రిందఉండి వీరు విద్యావిధానాన్ని చండామార్కులవలె నడిపించాలి.

ఈవిషయం యింతదూరం యింతలోతు త్రవ్వి తరచి చూడడంవల్ల, ప్రభుత్వాధికారం అనే నీడక్రింద విద్యాపీఠాలు విశ్వకళాపరిషత్తులు పనిచేయవలసినవై ఉన్నవనేవిషయం విశదమవుతోంది. రాజ్యాధికారం చలాయించడం అనేది అనేక రాజకీయతంత్రములతో కూడిన విషయం. ప్రభుత్వపుఖజానాలో ఉన్న పైకమునుబట్టికూడా ప్రభుత్వవిధానం మారుతూ ఉంటుంది. పైసా తక్కువైతే బడిపంతుళ్లకు జీతాలు తగ్గించవచ్చు పైసా తక్కువైతే, పిల్లలకు జీతాలు హెచ్చించవచ్చు. పాఠశాలలకోసం పన్నులు వేయవచ్చు పైసాకోసం పాకులాడి కల్లు పాకలు తిరిగి వేయించవచ్చు. అటు కల్లు పాకలవృద్ధి - ఇటు కళాశాలల వృద్ధి.

ఇదివరలో బ్రిటిష్‌ప్రభుత్వం ఈదేశంలో పరిపాలించిన కాలములో కల్లుసారా దుకాణాలు గంజాయి నల్లమందుదుకాణాలుసమృద్ధిగా పెట్టించి, వాటికి ఏటేట ఏలంపాటలు పాడించి చాలా ఆదాయం సర్కారు ఖజానాకు వచ్చేటట్లు చేశారు. ఈ మత్తుద్రవ్యముల సొత్తును ప్రత్యేకంగా ఉంచి ఆ ద్రవ్యాన్ని విద్యాశాఖ, కయ్యోడి ఖర్చును భరించడానికి వినియోగించుచున్నామని పాలుసరి ఆదాయవ్యయలెక్కలలో చూపించి, మద్యపానంతో విద్యాదానం చేస్తున్నామన్నారు. ఇదంతా ఎట్లా ఉన్నదంటే అసత్య వ్యాపారంచేసి సంపాదించిన ద్రవ్యంతో సత్యనారాయణ వ్రతం అఖండంగా చేసి ప్రసాదం పంచిపెట్టినట్లుంది. బాంబులు, డైనమైటు తయారుచేసి అపారంగా విక్రయించి అనేక యుద్ధరంగాలకు యీ మందుగుండుసామాను సప్లయి చేసి సంపాదించిన కోట్లకొలది ద్రవ్యం లోకశాంతి ప్రతిష్ఠాపనకార్యాలకు వినియోగించవలెనని వీలునామాలో వ్రాసినట్లుగా ఉంది. ఏటేట నోబెల్ బహుమానం అనే పేరుతో లోకోత్తములైన కొందరు శాస్త్రవేత్తలకు, కావ్యకర్తలకు, లోకశాంతిసంస్థాపనార్థమై కృషి చేసిన మహామహులకు సన్మాన పారితోషికంగా యిస్తూఉంటారు. ఈ నోబెల్ బహుమానం ఒక్కొక్కటి సుమారు లక్ష రూపాయలుంటుంది. కొందరు ప్రతినిధులు పరీక్షాధికారులవలె మంచి చెడ్డలు ఆలోచించి ఆయా ప్రత్యేక కృషికి చెందిన బహుమానం ఎవరికి ఆ ఏడు చెందవలెనో నిర్ణయించి యిస్తారు... ఈ విధంగా యివ్వబడే నోబెల్ బహుమానం అపూర్వ జగత్ప్రసిద్ధ కావ్యకర్తయైన రవీంద్రనాథ టాగూరుగారికి ఒకసారి సమర్పించబడింది. శాస్త్రవిజ్ఞానంలో మనదేశమందున్న సర్ సి. వి. రామన్‌గారికి లభించింది. లోకశాంతిమార్గోపదేశకుడైనవానికి యివ్వవలసిన పారితోషికం ఒకటి ఉంది. ఈ కాలంలో యీ లోకంలో పురుషోత్తముడనబడిన గాంధిమహాత్ముణ్ని యీ నోబెలు బహుమాన సంఘమువారు గౌరవించి తమ గౌరవమును నిలువబెట్టుకొనలేకపోయినారు. ఇంతకూ యిన్ని లక్షలకొలది రూపాయిల ద్రవ్యాన్ని ఏటేట ఎక్కడనుంచి యిస్తున్నారు? స్వీడెన్ దేశస్థుడైన ఆల్‌ఫ్రెడ్ బెర్న్‌హార్డ్ నోబెల్ అను బ్రహ్మాండమైన కోటీశ్వరుడు ఒక బ్రహ్మాండమైన ద్రవ్యనిధిని ధర్మనిధిగా ఏర్పాటుచేసి చనిపోయినాడు. ఇతని జననము 1833 సం॥ మరణము 1806 సం॥ ఆ ధర్మనిధిమీద వచ్చే వడ్డీని యీ విధంగా పారితోషికము నిచ్చే నిమిత్తం వినియోగించవలెనని తన వీలునామాలో వ్రాసి చనిపోయినాడు. ఆ మహానుభావుడు యింత అపారమైన కుబేరనిధిని ఎట్లా సంపాదించినాడు అని అడగండి. బాంబులను డైనమైటను కనిపెట్టి వాటిని విరివిగాతయారుచేయించి సప్లయిచేసినటువంటి బాంబుజనకుడు ఇతడు. ఈబాంబుబాబు తయారుచేసిన "నైట్రో గ్లిసరిన్" అనబడే ప్రేలుడు వస్తువుతో అతడు లక్ష్మీపుత్రుడైనాడు. లక్ష్మీపుత్రుడే కాదు. లక్ష్మీభర్త అయినాడు:—లోకవిలయ మానవమారణసాధనవ్యాపారంలో గడించిన టువంటి కోట్లకొలది, అర్బుదాలకొలది అయిశ్వర్యాన్ని, ఆఖరుకులోకశాంతి, విజ్ఞానకాంతి వగైరా ప్రయోజనములకై తనపేరుమీదుగా వినియోగపడవలెనని మనసు పడ్డాడు అతడు చేసినదంతా యుద్ధసాధనాల వ్యాపారం. అందువల గడించినద్రవ్యాన్ని లోకశాంతి సాధనవిధానాల బహుమానాలకు కైంకర్యం చేశానన్నాడు. మారణసాధనాలవల్ల గడించినసొత్తును, "మారణం కురు" (రణంఅనగా యుద్ధమును, మా కురు అనగా చేయవద్దు) అనే ఘనుల పనుల వినుతించుటకు వినియోగించాలన్నాడు. అసత్యవ్యాపారం చేసి గడించిన వర్తకుడు సత్యనారాయణవ్రతం మహోన్నతంగా అద్భుతంగాచేసి సతతం తనుపేరు లోకవిఖ్యాతం కావాలని కోరుతాడు. మద్యపానంతో విద్యాదానంచేసిన బ్రిటిష్‌వారు కూడా అబ్కారీ కల్లుపాటలతో, "శ్రీమన్మహా జార్జిపుంగవ!" అనే పాటలతో, మన పాఠశాలలు వర్ధిల్లునట్లుగా మారుమ్రోగునట్లుగా చేశారు.

"జార్జి దీ ఫిఫ్తు మేరీలు - సౌఖ్యమలర
ధరను పాలింతు రాచంద్ర-తారకముగ!"

అనే గీతముల నేర్పి కల్లుగీతల ప్రోత్సహించారు.

ఒకప్పుడు ఆంధ్రదేశంలో తాడిచెట్లకు

# ★ కాలక్షేపం ★

ఒకవిధమైన తెగులు పుట్టింది. తాడిచెట్టులోని శేతమువ్వ ఎండిపోయి చెట్టు అంతా చెదలు తిన్నట్లుగా చీడపట్టినట్లుగా చెడిపోవడంవల్ల కల్లుగీసెడి కల్పవృక్షములన్నీ కళ్ళముందర తెగుళ్ళపాలై పోవడంచూచి బ్రిటిష్ ప్రభుత్వానికి మిగుల దిగులుకలిగి, వెంటనే ప్రతిగ్రామంలోనూ, పల్లెలోనూ ఎక్కడెక్కడ ఏ తాడిచెట్టు పాడైపోతున్నదో కనిపెట్టి, దాని వ్యాధి యితర చెట్లకు వ్యాపించకుండా కట్టుదిట్టం చేయవలెనని శాసించారు. ప్రత్యేకంగా యీ డ్యూటీ మీద, తాడిచెట్ల డ్యూటీమీద, కొందరు స్పెషలు తహసీల్దారులను నియమించారు. "తాడిచెట్ల తహసీల్దారులు" అని వారికి నామకరణం చేశారు. అంటే యీ తహసీల్దారులు మిగిలిన సాధారణ తహసీల్దారులకంటె చాలా పొడుగుగా తాడిచెట్టంత ఉంటారని అర్థంకాదు. కడవలతో తెల్లని కల్లు సమృద్ధిగా యిస్తున్నటువంటి తాడిచెట్లనూ, ఆ తాడిపాడినీ కాపాడి, అబ్కారీ ఆదాయం పడిపోకుండా చూడడమే ప్రభుత్వానికి పాడియని ఎంచి, తాడిచెట్ల తెగుళ్ళపై దాడిచేయుటకై యీ తాడిచెట్లు తహసీల్దారులు నియమింప బడ్డారు. కాని గాంధీ అవతరించిన తర్వాత మనస్వరం మారింది, మనరాగం, మనతాళం కూడా మారింది. బ్రిటిష్‌వారి కల్లుపాటలకు మనం ప్రక్కతాళం వేయడం మానివేశాము. మీదు మిక్కిలి అటువంటి తాళం వేయకుండా సప్తతాళభంజనమూ సమస్త తాళభంజనమూ చేయుటకై "రఘుపతి రాఘవ రాజారాం పతిత పావన సీతారాం" అని సిద్ధమైనాము. మన అహింసా రాగం మనం ఆలాపన చేసేసరికి అబ్కారీ పాటలు పాడైపోయాయి. శ్రుతి తప్పింది. బ్రిటిష్ ప్రభుత్వానికి స్మృతి తప్పినంత స్థితివచ్చింది.

అయితే, యీ మద్యపాననిషేధం యీ మధ్యకాలంలో వచ్చిందే కాని, మనకది అనాదిసిద్ధంగా ఉన్నది కాదని వాదించెడిరాజకీయసనాతనిస్టులూ గీతాసార విశారదులూ కొందరున్నారు. వారికి సమాధానమివ్వడం కష్టమైన సమస్యకాదు. "కుంజరయూథంబు దోమకుత్తుక జొచ్చెన్" అనే సమస్యకంటె కష్టమైనదికాదు. ఆ సమస్యనే తెనాలిరామలింగకవి అద్భుతంగా అవలీలగా సవ్యాపసవ్యంగా పూరించాడు. "గంజాయి త్రాగి తురకల సంజాతము చేరి కల్లు చవిగొన్నావా?" అని ఆ పద్య ప్రారంభంలోనే సవాలు చేశాడు. అటువంటి మద్యపాన అభ్యాసంలో పడకపోయినట్లయితే, ఏనుగంత భారతజాతి దోమకుత్తుక జొచ్చినట్లుగా ఇంగ్లండుఅంత చిన్నదేశానికి లోబడి "శరణు! శరణు!" అని సలాముచేయడం ఎందుకు సంభవిస్తుంది? తెనాలిరామలింగ సుకవి చెప్పిన సాక్ష్యమునుబట్టి మహమ్మదీయ మహాయుగంలో సహవాసదోషంగా మనకీ వ్యసనం ఏర్పడి ప్రజలకు అశనం వసనం కరవైన కష్టకాలం సంప్రాప్తించింది. స్వాతంత్ర్యం అనేది స్వాహా అయిన తర్వాత, విదేశీయుల దాస్యంలో "భారతీసోహం!" (నేను భారతీయుడను) అనే అభిమానం కూడా అంతరించింది. ఆంగ్లమానస పుత్రులమైన తర్వాత "భారతదేశ్ హమారా!" (భారతదేశం మనదే) అనేమాట చాటుమాటుగా అనడానికి కూడా భయపడ్డాము. దేశం అంటే లేశంకూడాఅభిమానం లేకుండాపోయింది. "వందేమాతరం" అని అరచినందుకు 'వందేమాతరం' రోజులలో కాలేజీ విద్యార్థులను కాలేజీ అధికార్లు "డిస్మిస్!" అన్నారు. గాంధీ వచ్చినతర్వాత మనం బ్రిటిష్‌వారినే ఈదేశంలోనుంచి "డిస్మిస్" చేసి, "క్విట్ ఇండియా!" అనగల్గినాము.

ఏమైనప్పటికీ మహమ్మదీయుల కురాను కూడా సారా అనేది యింట్లోకి రానివ్వద్దన్నదని వారిలో నియమనిష్ఠా గరిష్ఠులు నిర్వచిస్తారు. యింటిలోకి కాదుకదా, సారా యింటివసారాలోకి కూడా రాకూడదు. మహమ్మదీయులలో నిష్ఠపరులైనవారు మసీదుకు నమాజు చెయ్యటప్పుడు, భగవంతుని సన్నిధికై, పెండ్లికుమారునివలె అత్తరును అంగీలకు పూసికొని వెళ్ళవలెనంటారు. అటువంటి అత్తరు అసలైన అత్తరుగా ఉండాలి. కాని సారా కల్పిన సెంటును వాసన కూడా చూడకూడదు. సారా వాసనకూడా సహించని అసహన వాసన వారి మతవిశ్వాస ఉచ్ఛ్వాస నిశ్వాసములలో ఉన్నదన్నారు. ఈ విషయాలు కొరానులో నొక్కివక్కాణించిన బుక్కులు పెక్కులు కావచ్చు. అదంతా పైగంబరుల మాటకావచ్చు. ఏ మతంలోనైనా ఇదే చిదంబర రహస్యం. శాస్త్రాలలోనూ శాటాకులలోనూ ఉన్నవన్నీ తిన్నగా జరగవు. తాటాకులలో ఏమున్నదనే ఆకులపాటు మనకెందుకనెడి వారికి ఏ వ్యాకులమూ లేదు. కులమూ లేదు. జాతీలేదు నీతీలేదు. మనకు గతించిన కాలం ఘనమైనదనే జ్ఞానమూ లేదు. భవిష్యత్తులో వృద్ధికి రావాలనే కృషీలేదు. "నిన్న అనేది అస్తమించింది. రేపుఅనేది అనిశ్చయం. కనుక, యిప్పుడే పానపాత్రను నింపి నిషా ఎక్కేవరకు త్రాగి ఖుషీగా ఉండాలి" అనే ఉమర్ ఖయ్యాం మతం మాత్రం మిగిలింది. అందుకనే తెనాలి రామలింగడు ఆమాట అన్నాడేమో! తెనాలి రామలింగనికి తెలియదంటారా ఉమర్ ఖయ్యాం? అయినా యీ కయ్యం మనకెందుకు? ఉమర్ ఖయ్యామ్ 12 శతాబ్దంవాడు. రామలింగకవి 16 శతాబ్దంవాడు.

మహమ్మదీయయుగానికి పూర్వమే మన స్థితి బాగుంది. మనదేశమందు మోహనదాస్ కరంచందు గాంధీ యుగంలోనే మద్యనిషేధం ప్రసిద్ధం అయింది అనే మాట అబద్ధం. కరంచందు గాంధీకి పూర్వమే చంద్రగుప్తుని కాలంలోనే, క్రీస్తుశకము 375 నుంచి 413 వరకు విక్రమాదిత్యుడనే బిరుదుతో పరిపాలించిన చంద్రగుప్తుని కాలంలోనే ఫాహియాన్ అనే చైనాదేశ యాత్రికుడు యీ దేశానికివచ్చి తాను స్వయంగా సందర్శించిన సందర్భ పరిస్థితులను వివరిస్తూ వ్రాసిన గ్రంథం ఒకటి చైనాభాషలో ఉంది. అందులో ఫాహియాన్ వ్రాసింది అంతా "పాహిమాం! పాహిమాం! ఫాహియాన్" అని రామాయణంలాగున పారాయణం చేయవచ్చు. "ఈ రాజ్యంలో ప్రజలు మద్యములు త్రాగరు. ఆహారానికి జంతువులను చంపరు. చండాలురే యీ రెండుపనులూ చేయుదురు. అట్టివారు ఊళ్లలోనికి వస్తే గంట కొట్టుతూ జనులను దూరముగా పొమ్మని హెచ్చరిస్తూ ఉంటారు. సారాదుకాణాలు లేవు. జనులు పందులను కోళ్ళను పెంచరు. గవ్వలు కూడా నాణెములుగా చెల్లును. రాజు దయాపరుడు. జనులు సుఖులైయున్నారు" అని 1554 ఏళ్లక్రింద ఉన్నదిఉన్నట్లుగా కన్నది కన్నట్లుగా కల్లకపటం లేకుండా దూష్యించకుండా భూషించకుండా తాను

చూసింది వ్రాశాడు. అష్టైశ్వర్య దేశంలో ఉన్నదన్నాడు. సారాదుకాణాలు లేవన్నాడు. రాజు దయగలవాడుఅన్నాడు. ప్రజలు సుఖులై ఉన్నారన్నాడు. "ఇక్కడంతా క్షేమం. అక్కడి క్షేమములు వ్రాయవలెను" అని మనం ఉత్తరంముగిస్తూ వ్రాసే ముక్తాయింపుమాటగా ఫాహియాన్ వ్రాయలేదు. మనకు ఈమధ్య వచ్చినదికాదు మద్య నిషేధం అని ప్రబోధించాడు ఫాహియాన్. అంతేచాలు. ఫాహియాన్‌కీ జై! చైనా దేశానికీ జై!

చైనావాళ్ళకు బ్రిటిష్‌వాళ్ళు నల్లమందు ఎగుమతిచేసి చాలా డబ్బు గడించారు. చైనావాళ్ళను నల్లమందుభాయీలను చేసినది తెల్లవాళ్ళే. ఇటువంటి మందులవల్ల చైనావాళ్ళు మందమతులు కావాలనే దురుద్దేశంతో చైనా దేశంమీద పరిపూర్ణానుగ్రహం చూపించారు. ఈ నల్లమందు వ్యాపారం లావాదేవీలతో లడాయికి దిగారు. చైనామీద దండయాత్రకూడా బ్రిటిష్‌వారు సాగించారు. ఈ దండయాత్రకైన కోట్లకోలది ఖర్చు అంతా భారతదేశ నుంచి తీసికొని, మనలను నోరుమూసికో అన్నారు. ఈ గొడవ అంతా బ్రిటిష్ మహాయుగంలో జరిగింది. కాని ఫాహియాన్ హయాంలోదికాదు. మనకు ఫాహియాన్ సాక్ష్యం పక్షపాతంలేని ఘరానా సాక్ష్యం. ఇటువంటిస్థితిలో మద్యపాననిషేధం మంచిదా చెడ్డదా అని యోచించడానికి ఆంధ్ర ప్రభుత్వం ప్రయత్నించవలసిన ప్రమేయ ప్రసక్తిప్రసంగమే అసంగతం.

ఇంతకూ వచ్చిన చిక్కేమిటంటే సర్కారుధనం సర్వకళాశాలలకు సాధనంగా ఉంది. ఆ కారణంచేత విద్యావిధానం అనేదానికి ప్రభువుల ధనం ప్రధానం అయింది. 'అయ్యా! నేను ఆదిభొట్ల నారాయణదాసుగారి శిష్యుణ్ణి"అని సగర్వంగా చెప్పుకొన్న శిష్యులున్నారు. "నేను చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రులుగారి శిష్యప్రశిష్యుణ్ణి"అని ప్రకటించుకొని ప్రసిద్ధిలోనికి వచ్చిన ప్రకటకవీంద్రులున్నారు. "నేను సుసర్ల దక్షిణామూర్తి శాస్త్రిగారివద్దసంగీతం సశాస్త్రీయంగా చెప్పుకొన్నాను" అని ఆలాపనచేసి ఉచ్ఛస్థాయిలోకి వచ్చిన యువకులున్నారు. ఆవిధంగా గురువు ప్రధానంగా గౌరవింపబడిన కాలం పోయింది. ఏ కాలేజీలో చదువుకున్నారని ప్రశ్నిస్తాం. గురువుపేరు సోదిలోకికూడా రాదు. ఏశాస్త్రంలో బియే-డిగ్రీ పుచ్చుకొన్నారని ప్రశ్నిస్తాం. ఏ సిద్ధాంతం మీరు అనుసరిస్తున్నారనే ప్రసక్తి రాదు. వేదాంతం చదివిన వానికి జీవితం ఎట్లా గడుస్తుందా? అనే సమస్య ప్రధానంగాని ఏ మతంలోనూ విశ్వాసం ఉండవక్కరలేదు. ఇటువంటి విద్యకోసం ఎన్ని కాలేజీలు పెట్టినా, ఇటువంటి విద్యను ఎంత దానంచేసినా ఆ విద్యవల్ల కలిగే ప్రయోజనం లేదు. విద్యకు కావలసిన పరమావధి ఆ విద్యకు లేదు. అవిద్యతో సమానం ఆ విద్య. అవిద్యను కూడా ఎంత దానంచేసినా చేయవచ్చు. దానికి కూడా అంతులేదు. "పూర్తిగ నిచ్చినన్ పెరుగు; పోదు యుగాంతపు వేళనైన" అని గొప్పగా చెప్పవచ్చు.

రామారావు సంగతి చూడండి. మంచి తెలివిగలవాడని వాళ్ళ నాన్న దృష్టిలో మిన్నగాఎన్నబడేవాడు. పరీక్షలు సమీపిస్తున్నవంటే సరి, వారం రోజుల ముందుగా జమాబందీ లెక్కలన్నీ తయారుచేసి హోలుసాలు వసూళ్లడొలు అణాల పైసలతో సరిపుచ్చినట్లుగా, పరీక్షలో తప్పకుండా వస్తాయనే పాఠాలలోని పేరాలకు పేరాలు దారాలు పేనినట్లుగా కంఠోపాఠం చేసేవాడు. హిందూదేశ చరిత్రలో ముఖ్యంగా అడిగేటటువంటి ప్రశ్నలు కొన్ని గుర్తుపెట్టుకొన్నాడు. రాత్రి టీ కాచి త్రాగడం - నిశాచరునివలె రాత్రి ఒంటిగంట దాటినా ఘనజట చెప్పినట్లుగా పుస్తకంలోనిదంతా పూసగ్రుచ్చినట్లుగా వల్లెవేయడం ప్రారంభించాడు. టీ త్రాగితే రాత్రి పుష్టిగానే ఉండేది. పగలు నీరసంగా ఉండేది. "అహర్నిశమున్" సుఖపుష్టి జేయున నేమాట అతని విద్యవిషయంలో అనడానికి అవకాశంలేదు. ఈ భారతదేశానికి మొట్టమొదట యూరోపు దేశంనుంచి వచ్చి అడుగుపెట్టి ఆశ్రయం సంపాదించినటువంటివాడెవరు? అనేది మనదేశ చరిత్రలో ముఖ్యంగా అడిగే ప్రశ్న. అది రామారావుకు తెలుసు. కాని అట్టి ప్రప్రథముడైన బుడతకీచువాని పేరు తెలియదు. అతడే "వాస్కోడెగామా". కాని రామారావుకు ఆ పేరును కంఠోపాఠం చేయడంలో "వాస్కో వాస్కో-డెగమా డెగమా" అని ఉచ్చరిస్తూ పాఠకంచేశాడు టీ త్రాగిన హుషారు నిషాలో. తెల్లవారేసరికి అతని మెదడులో మిగిలింది ఏమిటంటే, వాస్కో అనేవాడున్నూ, డెగామా అనే వాడున్నూ, మొట్టమొదట యీ దేశానికి వచ్చి యీ దేశంలో స్థావరం సంపాదించిన యూరోపియనులు అయియున్నారని అన్వయించాడు. పరీక్షలో అదే ప్రశ్న అనుకున్న ప్రకారం వచ్చింది. వెంటనే దానికి జవాబు వ్రాసిపారవేశాడు. వాస్కోయున్నూ డెగామాయున్నూ యీ దేశానికి మొట్టమొదట యూరోపునుంచి వచ్చి స్థావరం సంపాదించారు అని అనుమానంలేకుండా వ్రాశాడు. అతని ప్రక్కను అటు యిటు కూర్చున్న విద్యార్థులకు ఏవి జవాబు వ్రాయాలో తెలియలేదు. వెంటనే రామారావునైపుకన్ను గీటి, అతను వ్రాసింది ఏదో విశదంచేయవలసినదిగా విన్నవించారు. ఈమాత్రం సహాయం తన సహాధ్యాయులకుచేస్తే పుణ్యం పురుషార్థంకూడా ఉంటుందని అతను అనుకున్నాడు. అందుచేత తాను వ్రాసిన కాగితం వాళ్లకు వీలుగా చూపించాడు. వాళ్ళుకూడా బ్రతుకుజీవుడా అని అదేప్రకారంగా జవాబు వ్రాశారు. ఇంచుమించు అదే జవాబును మరికొందరుకూడా చూచి తలయూచి వ్రాసి తరించామని సంతసించారు. ఈవిధంగా వాళ్ళందరికీ రామారావు విద్యాదానం చేసినవాడైనాడు. మనవాడికాగితం చూచి వ్రాసినవాళ్ళందరికీ,ఆసహాధ్యాయవలయానికంతటికీ ఆప్రశ్నకు మార్కులు ఒక్కమాదిరిగానే హెచ్చుతగ్గులులేకుండా వలయంగా వచ్చాయి. దీనికి కారణం ఏమిటంటే,"విద్యయను దివ్యధనం బఖిలార్థికోటికిన్ పూర్తిగ నిచ్చినన్ పెరుగు; - పోదు యుగాంతపు వేళనైన" అనే నమ్మకంతోనే రామారావు కూడా ప్రవర్తించాడు. తనకుతెలిసినవిద్యను విద్యార్థులైన యితర విద్యార్థులకు ఎంత పంచిపెట్టినప్పటికీ తనవిద్య పెరుగునేగాని, తరగదని అతని నమ్మకం. అది తరగి "పోదు పరీక్షల వేళనైన" అని అతని నమ్మకం. అతని అజ్ఞానం అందరికీ అంటువ్యాధివలె వ్యాపించింది. విద్యవలెనే అవిద్యకూడా ఎంత పంచిపెట్టినా వృద్ధిఅవుతుందిగాని క్షీణించదనుటకు పరమప్రమాణంగా రామారావు పరీక్షాప్రయోగమే చాలు. పరీక్షప్యాసవడం ప్రధానంగాని శిష్యశిక్షణ ప్రధానంకాదు. అట్టిది ఆత్మప్రబోధంలేని అవిద్య. అయిశ్వర్యమూ అందుమూలంగా చిందులుత్రొక్కే ఆత్మధైర్యమూ అతిశయించిన ఒకజాతిని అట్టి అయిశ్వర్యమూ ఆత్మధైర్యమూ అంతగాలేని మరొకజాతి (బాగుపడవలెననే ఆశతో) ఆశ్రయించి అనుసరించి అనుకరించి కాపీ చెయ్యడమే ఫ్యాషన్ అనేది అభ్యుదయాభివృద్ధికర అంతర్జాతీయ అన్యోన్యాశ్రయ భావ ప్రభావ అంతరార్థం.

★

# రాజేశ్వరి

అతడే మరెవరైనా అయితే యీ సాంఘిక నేరానికి చట్టం నిర్ణయించిన పూర్తి శిక్షను తన అధికార హోదాతో విధించే ఉండేవాడు కాని...

...కాని ఆమె కేవలం తన భార్య అయిపోయింది.

నలుగురులోనూ మెసలడం ఎలాగో చాతకాక ప్రతివాళ్ళతోనూ తగువులు తెస్తూంటే ఎన్నాళ్ళని భరించడం.

తన మంచితనం, ఉద్యోగహోదా ఎవరికొక్కవాలి, అందులోనూ యిరుగూ, పొరుగూ ఆడవాళ్ళకి.

ఎంతకని యిళ్లు మారుస్తూండడం.'

కనీసం నెల రోజులైనా ఒక యింట్లో సవ్యంగా ఉండలేకపోతే ఎలా చావడం.

ఇది వెంకట్రావు నిత్యజీవిత సమస్య.

నానాటికి శృతిమించుతున్న ఈ దుర్భగ సమస్యని, యికనైనా అంతుచూడకపోతే తన భార్య మాట అటుంచి తన కూడా సంఘంలో మెసిలే యోగ్యత క్షీణిస్తుందేమోనని భయపడ్డాడు వెంకట్రావు.

చూసి చూసి ఒక సుముహూర్తాన తన పైఅధికారిదగ్గరకు వెళ్ళాడు.

ఎలాగైనా తనని మహాటవీ మధ్యంలో ఒక మన్యం తాలూకాకి బదిలీ చెయ్యమని కోరాడు.

పై అధికారి ఆశ్చర్యపడ్డాడు.

ఆ తాలూకాకి ఎవరిని బదిలీచేసినా 'వెళ్ళను బాబో' అని తప్పించుకుండికి విశ్వప్రయత్నం చేసేవాళ్ళే కాని సంతోషంగా వెళ్లినవాడు యింతవరకూ ఒక్కడైనా లేడు. అటువంటిది వెంకట్రావు బుద్ధిపూర్వకంగా అక్కడికి బదిలీ కావాలి అని అంటే, పై అధికారికే ఏమిటి, ఆ తాలూకా సంగతి తెలిసిన అందరికీ ఆశ్చర్యం వేస్తుంది.

పై అధికారి చాలా సంతోషించాడు వ్యవహార దక్షుడైన వెంకట్రావు అక్కడకు వెళతానన్నందుకు.

వెంటనే టైపుమిషను టపటప లాడింది

ఆర్డరు పట్టుకుని టకటక బూటుతో యింటికి వచ్చాడు వెంకట్రావు.

భార్యను పిలచాడు.

'యీ వేళ యింత త్వరగా వచ్చేశారేం' అంది భార్య రాజేశ్వరి.

'యీరోజుతో యిక్కడ ఉద్యోగం అయిపోయింది. మనకి బదిలీ అయింది.'

"ఎక్కడికి"

'మన్యం తాలూకాకి'

'అమ్మ బాబోయ్!'

'ఎప్పుడూ ఒక్కదగ్గిరే కూర్చుందామనుకున్నావేం పాపం'

"ఒచ్చి ఆర్నెల్లైనా అవలేదుకదా అప్పుడే బదిలీ ఏమిటండీ"

"మరి నీ తడాఖా అంటే ఏమిటనుకున్నావ్"

"మధ్యని నేనేంచేశాను"

"ఏ యింట్లో ఉంటే ఆ యింటి యిరుగు పొరుగులవాళ్లతో మనం తగువులాడుతున్నామట. అందుకని వాళ్లందరూ మనమీద కాయితాలు వ్రాసి పై అధికార్లకు పంపారు. మనం నలుగురితోనూ తిరిగే యోగ్యతలేని వాళ్లమని యిలా చేశారు" అని అతి నేర్పుగా అబద్ధమాడాడు వెంకట్రావు.'

"మనమేం తగువులు తెస్తున్నామండీ" అంది కోపంగా రాజేశ్వరి.

'ప్రభా'

అప్పుడే ఆమె ముఖం జేగురురంగుగా మారటానికి ప్రారంభిస్తోంది.

"అదే నేనూ ఆలోచించి ఆశ్చర్యపోతూన్నది. అయినా యిదీ మన మంచికేగా. అక్కడ చక్కని యిల్లు ఉంది. ఎక్కచ్చిగా మనమే వాడుకోవచ్చు. యిరుగూ, పొరుగూ ఎవరూ లేరు. నువ్వు తగువు వేద్దామన్నా అలాంటి అవకాశంలేదు.'

"నలుగురు లాగే మీరూ అనండి. నేనేం తగువులు తెస్తున్నాను చెప్పండి. యింట్లో మీరు యిలా అంటూంటే నే ఊళ్ళోవాళ్ళు మరీ అంటున్నారు"

"వాళ్లని నువ్వూ ఊరుకోవడం లేదుగా"

"అయితే మీ ఉద్దేశం అందరిచాతా మాటలు పడమనేనా?"

అప్పుడే భార్యలోని మార్పుని గమనించాడు వెంకట్రావు. యింక యింతకన్న ముదరబెడితే లాభం లేదనుకున్నాడు.

"పోనీలే యిప్పుడు అయిపోయిన దానికెందుకు" అన్నాడు.

"అయితే మన యింటి సంగతులన్నీ ఆఫీసువాళ్ళ కెందుకండీ నాకు తెలియక అడుగుతాను'

"నిజమే కాని మనం సంఘజీవులం కాబట్టి సంఘంతో ఐకమత్యంగా ఉండాలి. అదే మనకి చాతకాలేదని వారి అభిప్రాయం"

## 2

మహారణ్యంమధ్య మెలికలు తిరిగిన ఘాట్ రోడ్డుమీదనుంచి బస్సు నిదానంగా నడుస్తోంది. ఒకప్రక్క కొండ. మరోప్రక్క పాతాళానికి దారితీసే అగాధం ఆ అగాధంవైపు చూస్తూంటే కళ్ళు తిరిగి గుండె జారిపోయినట్టుంటేది రాజేశ్వరికి. ప్రమాద నివారణకై అగాధంవైపు కట్టిన పిటగోడకి మెలికలు తిరుగుతున్నప్పుడు ఎన్నోసార్లు ఢీకొనేదిబస్సు. దురదృష్టవశాత్తూ పిటగోడ పడిపోతే బస్సూ, బస్సులోఉన్న మనుష్యమాత్రులూ ఏమైపోతారు అనుకుంది ఆమె. ఒక్క సారి డ్రైవర్ని చూసింది. సకలభువన రక్షకుడైన చక్రపాణివోలె డ్రైవరు స్టీరింగు చక్రాన్ని పట్టుకున్నాడు. ఆ క్షణంలో సాక్షాత్ భగవంతుడైన ఆ స్టీరింగు చక్రపాణిని ప్రాణభిక్ష పెట్టమని మనస్సులో ప్రార్థించింది.

ఘాటి ఎక్కలేక మూలుగుతూ, మూలుగుతూ మందగమనం సాగిస్తోంది బస్సు. ఆ గహన కుహర యానంలో రకరకాల వృక్షాలూ, వాటి పుష్పాలూ, వాటి పరిమళాలూ, ఆ వింతప్రకృతీ, ఆ వనసౌందర్యం నిజంగా చూసి అనుభవించవలసినదే కాని...

...కాని దురదృష్టవశాత్తూ పిట్టగోడ పడిపోతే బస్సూ, బస్సులో ఉన్న మనుష్యమాత్రులూ ఏమైపోతారో అన్న ప్రమాదకరమైన ఆలోచనలోపడ్డ రాజేశ్వరికి ఆ రకరకాల వృక్షాలూ, వాటి పుష్పాలూ, వాటి పరిమళాలూ, ఆ వింత ప్రకృతీ, ఆ వన సౌందర్యం ఏమీ కనిపించనే లేదు.

ఎలాగైతేనేం బస్సు మెల్లిగా ఘాట్ రోడ్డును దాటేసింది. అలవాటు ప్రకారం డ్రైవరు బస్సును ఆపుచేసి ఘాట్ రోడ్డులో ఏ ప్రమాదం రాకుండా బస్సునీ, బస్సులో ఉన్న ప్రయాణీకుల్నీ కాపాడినందుకు అక్కడ వనదేవతయైన చెట్టుక్రింద బండకి ఒక టెంకాయకొట్టి మళ్ళీ బస్సు ఎక్కాడు.

బస్సు గమ్యస్థానం చేరుకుంది ఏజన్సీ తాలూకాకి ముఖ్యపట్టణమైన ఆ గ్రామంలో పాతిక ముప్ఫై యిళ్లుకన్న ఎక్కువ

ఉండవు. ఊరిజనాభా ఒకవందకు మించదు. నాలుగైదుశాఖల ఉద్యోగస్తులూ, వారిగుమస్తాలూ, బంట్రోతులూ, ఒక మునాదారూ మొత్తంమీద అందరూ ఉద్యోగస్తులే. వాళ్ళ యిళ్ళూ, ఆఫీసులూ కాక పైగా ఉన్నవి ఉద్యోగులసౌకర్యార్థం వెలసిన ఒక దేశవాళీ కాఫీ హోటలూ, చిన్నకిరాణా దుకాణం. ఉన్న ఆ పాతిక ముప్పై యిళ్లుకూడా అక్కడా అక్కడా ఉన్నాయ్‌కాని ఒక్కదగ్గర లేవు. ఊరికి నాలుగువైపులూ ఎటు చూసినా మహారణ్యం. మూడు దశాబ్దాల క్రిందట ఆ ప్రాంతంలో లేచిన పితూరీలో శాంతి భద్రతలు నెలకొల్పడానికి తెల్లదొరలు యీ వూరిని సృష్టించి ఆఫీసులు పెట్టారు. ఇక్కడ ఆఫీసుల్లో చెప్పుకోతగ్గంత పనీపాటూ ఏమీ లేకపోయినా అక్కడ ఉన్నందుకే ఉద్యోగస్తులకి జీతం యివ్వవచ్చు. ఉదయం తొమ్మిది గంటలకు గాని పొగమంచు తెరలు విడవు. అప్పుడు సూర్యదర్శనం అవుతుంది. తిరిగి మూడు గంటలకు సూర్యుడు మాయమైపోతాడు. శీతాకాలంలో మరీకష్టం. ఆ చలికి కొరడు కట్టిపోవల్సిందే. యిరవైనాలు గ్గంటలూ నెగళ్ళు పెట్టుకోవల్సిందే. అక్కడి నీరు త్రాగితే ఆజన్మాంతం మలేరియా వదలదని ప్రతీతి. కాని మలేరియా నివారణశాఖ వారు చేస్తూన్న కృషివల్ల దాని ఉధృతం తగ్గింది. ఏమైనా ఆ వూరు ఒక పీడకల వంటిది. నేరస్థులకు అండమాన్సు ఎటువంటిదో ఉద్యోగస్థులకు ఆ వూరు అటువంటిది

## 3

విశాలమైన మూడు గదులూ, ఒక వంటిల్లూ, యింటి ముందు ఆవరణలో రకరకాల పువ్వుల చెట్లూ, పెద్ద పెరడూ— యిల్లు చూడగానే పిల్లా, పచికా లేని దంపతులకి ఆ యిల్లు పెద్దదనే అనిపిస్తుంది

యింటిగురించి ఏవిధమైన వ్యాఖ్యానాన్నీ చెయ్యలేదు కాబట్టి రాజేశ్వరికి యిల్లు నచ్చినట్టే.

ఆ క్రొత్త ప్రదేశంలో, నూతన వాతావరణంలో వారంరోజులు గడిచాయి. ఆ ప్రదేశానికిగానీ, ఆ వాతావరణానికిగానీ యింకా రాజేశ్వరీ, వెంకట్రావూ అలవాటు పడనేలేదు.

రోజులు గడవడం అక్కడ చాలా కష్టంగానే ఉంది వెంకట్రావు ఎలాగో ఒకలాగ ఆఫీసుపనితో కాలం గడుపుతున్నాడు గాని, రాజేశ్వరికి పగలు తరగకుండానే ఉంది. నవలలూ, పత్రికలూ ఎంతసేపని [illegible] మంటే యిరుగూ, పొరుగూ లేదాయె.



"యిక్కడకు పులులుకూడా వస్తాయా శీనయ్యా"
"అదో మాటా తల్లీ! ఒకొక్కప్పుడు ఊరంతా గస్తీ తిరుగుతాయికూడా"

రోజులు గడిచిపోతున్న కొద్దీ ఒకరోజుకొకరోజు అక్కడి జీవితం ఆవిడకు కష్టమే అనిపించింది. కష్టమన్నమాటే ఏమిటి నిజంగా జైల్లో ఉన్నట్టే భావపడింది.

ఒక రోజున వెంకట్రావు క్యాంపు వెళ్లిపోయాడు.

చీకటి రాత్రి.

యింటిదగ్గర కాపలాకై పడుకునే ముసలి బంట్రోతు యింకా రాలేదు.

ఎటుప్రక్క చూసినా గాఢాంధకారం.

నాలుగు మూలలనుంచీ నక్కల అరుపులూ, కీచురాళ్ళ ధ్వనీ, హోరుమని గాలీ.

రాజేశ్వరికి భయం పట్టుకుంది. యిన్నాళ్ళూ భర్త తోడుగా ఉండేవాడు కాబట్టి ధైర్యంగానూ, ధీమాగానూ ఉంది కాని యీనాటి కారు నల్లని కాళరాత్రి ఆమెను భయపెట్టింది. ఎదురుగా ఆ చీకట్లో జుత్తు విరియబోసుకున్న దెయ్యంలా ఉన్న జీలుగ చెట్టునుచూసి ఆమె 'అమ్మో' అంది.

"ఏమమ్మా" అన్నాడు బంట్రోతు.

బంట్రోతు ఎప్పుడు వచ్చినదీ కూడా ఆమెకు గుర్తులేదు.

"ఎప్పుడొచ్చావ్ శీనయ్యా... నాకు భయంవేస్తోంది. చూడు అదేదో దెయ్యంలా ఉంది"

"నరేం భయంలేదమ్మా! నే నిక్కడే ఉన్నానుగా. అది దెయ్యంకాదూ, భూతం

# ★ రాజేశ్వరి ★

కాదూ రోజూ మనం చూసే జీలుగుజెట్టే తల్లీ!"

"ఏమో నాకు చాలా భయం వేస్తోంది"

"ఏం భయంలేదమ్మా. తమరి కింకా కొత్త కాబట్టి అలా అవుతున్నారు. ఇక్కడకువచ్చిన కొత్తలో నేనూ అలాగే భయపడేవాడినండి అమ్మగారు. కాని సంవత్సరాలు గడిచినకొద్దీ అలవాటు పడిపోయి యిప్పుడు ఊళ్లో పులిగానీ, దుమ్మరగుండు గానీ ఏది తిరిగినా భయమే ఉండదుతల్లీ"

"యిక్కడకు పులులుకూడా వస్తాయా సీతయ్యా!"

"అదోమాటాతల్లీ. ఒకొక్కప్పుడు ఊరంతా గస్తీ తిరుగుతాయికూడా"

"అమ్మయ్యో! మరి ఎలాగ సీతయ్యా!"

"అలాగేనమ్మా మరి ఏంచేస్తాం. ఇప్పుడు అయ్యగారు మకాంచేసిన బంగాళాచుట్టూ పగలూ, రాత్రీ కూడా పులులు తిరుగుతునే ఉంటాయి"

"మరేం ప్రమాదం రాదుకదసీతయ్యా!"

"ఎంతమాట సెలవిచ్చారు తల్లీ. అలాగైతే ఉద్యోగం చెయ్యగలమా"

"ఏమోసీతయ్యా! నాకు బెంగగాఉంది."

"పిచ్చితల్లీ! పాపం అయ్యగారు ఏం తప్పిదం చేశారో ఇక్కడకు బదిలీ అయారు. ఆ తప్పిదానికి వారేకాకుండా మీరుకూడా యిక్కడ బాధపడుతున్నారు పాపం"

"అదేమిటి సీతయ్యా అలా అంటున్నావ్"

"అచ్చే ఏం ....."

"అయ్యగా రేదో తప్పుచేశా రంటున్నావే"

"అవునమ్మా! లేకపోతే యిక్కడకు బదిలీ చెయ్యరు."

తప్పెవరిదో ఆమెకి యిప్పుడు అర్థమైంది.

ఈ దుస్థితికి అంతకీ తనేకదా కారణం అనుకుంది.

తనమూలంగా భర్తకు అప్రతిష్ట వస్తున్నాదని భయపడింది.

యీ విధంగా రాజేశ్వరి బాధపడటం యిదే మొదటిసారి.

## 4

వెంకట్రావు క్యాంపునుంచి రాగానే ప్రారంభించింది రాజేశ్వరి.

"ఏమండీ యిల్లూ సంసారం అంతా మరిచిపోయారేమిటి? యిన్నేసి రోజులు క్యాంపులో ఉండిపోతే ఎలాగండీ"

"వెళ్ళి మూడు రోజులేగా అయింది"

"నామట్టుకు మూడు సంవత్సరాలులా ఉంది. యిక్కడ ఉండడానికి నాకు ఎంత భయం వేసిందనుకున్నారు"

"ఏం సీతయ్యరాలేదూ"

"వచ్చేవాడు. అయినా యీ అడివిలో చుట్టూ నక్కలూ, జంతువులూ అరుస్తూంటే"

"మరెలాగ అంతా ఉండటం లేదూ"

"యిక్కడనుంచి ఎప్పుడు బదిలీ చేస్తారండి"

"సరిసరి నిన్నకాక మొన్న వచ్చాం. అప్పుడే మన నెవరు బదిలీచేస్తారు. అందులోనూ మనమీద కోపంచాత యిక్కడకు పంపించారన్న విషయం మరిచిపోయావా"

"మనమీద కోపానికి మనం ఏంచేశామని"

"రామాయణమంతా విని రాముడికి సీత ఏమౌతుంది అన్నట్టుంది."

"యిక్కడ ఉండలేం సుమండీ"

"ఏం పోట్లాడిందికి ఎవరూ లేరనా"

"మీ వేళాకోళానికి వేళా, పాళా, సమయం సందర్భం లేనట్టుంది. ఉండలేకనే ఛస్తూంటే వేళాకోళ మాడతారు మీరు."

* * *

యిలా ఆరునెలలు గడిచాయి.

రాజేశ్వరికి భయం ఒకరోజుకు ఒకరోజు ఎక్కువ అయి బెంగపెట్టేసుకుంది. పెద్దపులుల అరుపులు ఆమె చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి. ఏ వస్తువునిచూసినా దుమ్మలగుండులాగనే కనిపిస్తున్నాది.

ఒకనాడు వెంకట్రావు క్యాంపునుంచి తిరిగి వచ్చేసరికి రాజేశ్వరి వెక్కివెక్కి ఏడుస్తూ కూర్చుంది.

భార్య ప్రవర్తన కనిపెడుతూన్న వెంకట్రావుకి ఆరోజున ఆమెలో పూర్తి మార్పు కనుపించింది.

ఆమెపరిస్థితిని చూసి చాలా జాలిపడ్డాడు.

"నేను చచ్చేవరకూ యీవూరినుంచి కదలరా" అంది.

"నాలుగురోజులు ఓర్చాలి మరి"

"అవును యీలోగా ఏ పులో, ఎలుగుబంటో యీడ్చుకుపోతుంది."

"మరి నన్నేం చెయ్యమన్నావ్. ఇదంతా నువ్వు చేసుకున్నదేగా"

"అందుకనే అనుభవిస్తున్నాను. యీ శిక్షకి అంతం ఉందోలేదో"అంది ఏడుస్తూ.

వెంకట్రావులో కరుణరసం వెల్లువలై పరుగెత్తింది. యిక ఆమెని అనునయించక ఉండలేకపోయాడు.

"అయితే యిక్కడనుంచి వెళిపోవాలంటావ్" అన్నాడు.

"అంత అదృష్టంపడితే మరేంకావాలి"

"అయితే అదీ మనచేతులో నేఉంది."

"నిజంగానేనాండి" అంది ఆతృతతో.

"ఊ! కాని నువ్వు ఒక పని చెయ్యాలి. ఎప్పుడూ ఎవరితోనూ పోట్లాడనూ అని కాయితం రాసి యిస్తే చాలు."

"కాయితం ఏం ఖర్మం. దస్తావేజు రాసి యిమ్మంటే యిస్తాను" అంది.

మరునాడే వెంకట్రావు సెలవు పెట్టేడు.

సెలవు అనంతరం మరోదగ్గరికి బదిలీ అయింది.

* * *

కథ అయిపోయింది.

రాజేశ్వరిలో పోట్లాడే స్వభావం పోయిందో లేదో యిప్పుడు నాకు తెలియదు.

కాని ఒక్క విషయం...

రాజేశ్వరిలో సత్పరిణామం వచ్చిందంటే ఆ ఘనత వెంకట్రావుది. అతణ్ణి నిజమైన సంస్కారి అని చెప్పవచ్చు.

ఆమె పూర్వంలాగనే ఉందంటే అది ఆమెతోడనే పుట్టిన స్వభావం. ఆ స్వభావాన్ని ఎంతటి సంస్కర్త అయినా మార్చలేడు.

ఎప్పుడైనా వాళ్లు మీకు తారసిల్లినప్పుడు—

గెలుపు వెంకట్రావుది అయితే అతన్ని అభినందించండి.

లేకపోతే రాజేశ్వరిపై సానుభూతి చూపండి. కాని ఆమెని తిట్టకండి. 



# కుర్చీలో కూనిరాగం

ఆరుద్ర

నిన్న నే, యథాలాభంగా పోతున్న ఒకానొక మహాకవిని నిలబెట్టి, ఆయన్ని దర్శించుకొన్నట్టు నటించి, మంచిగా నాలుగుమాటలాడి, లంచంగా రెండుపొగడ్తలు పొగిడి "మహాకవీ, మహాశయా, మహానుభావా! ఇంగ్లీషులో కల్చర్ అనేదాన్ని తెనిగించినట్టు కనబడే సంస్కృతి అనేదానికి నిర్వచనం ఏమిటో కాస్త సెలవిస్తారా" అని అర్థించేటట్టు ప్రార్థించాను. ఆయన అందరు మహాకవుల లాగే, మహాశయులలాగే, మహానుభావుల లాగే మోమెత్తి, తల పంకించి, చూపు నిగిడించి చిరునవ్వునవ్వి, అంతలోనే నిట్టూర్పు విడిచి, నానాబాధాపడి "ఏ నాయనమ్మ నడిగినా చెప్తుందిగా" అని తప్పుకొన్నారు.

ఈ మహావాక్యం విన్నాక, మహావాక్యంతు కర్తవ్యం అని నాకు నేను హెచ్చరిక చేసుకొన్నాను. వారు సెలవిచ్చినట్టు ఏ నాయనమ్మనైనా వెళ్ళి అడుగుదామని నిశ్చయించుకొన్నాను. కాళ్ళీడ్చుకొంటూ వెళ్ళి ఆవిడ దర్శనం చేసుకొన్నా. ఆవిడపెట్టిన ప్రశస్తమైన దిబ్బరొట్టె ఆవకాయ నంజుకొంటూ, "నాయనమ్మా, నాయనమ్మా సంస్కృతంటే ఏమిటో కాస్త చెబుదూ" అన్నాను. ఆవిడ మారు వడ్డిస్తున్న దిబ్బరొట్టె కాస్తా ఉపసంహరించి నేను మావంశానికి తలవంపులు తెస్తున్నంత అపకీర్తిని దిగమింగి, "ఒరే అంత వాడి కడుపునపుట్టి, అల్లంతవాళ్ళ మనవడివై సంస్కృతం అంటే ఏమిటో తెలియదట్రా" అని కోపించింది.

నేను తమాయించుకొని, "సంస్కృతం కాదు నాయనమ్మా! సంస్కృతి, సంస్కృతి. దాన్ని ఇంగ్లీషులో కల్చరంటారు. సరైన జాతీయమైన తెలుగులో కల్చరంటేఏమిటో ఒక్కమాటలో చెప్తావని అడిగా" అని ఆవిడకి బోధపరిచాను. ఆవిడ "ఏమిటీ ఏమిటీ" అని రెట్టించి, "పోనిద్దూ పోయిన పొద్దల్లా పోయి అవన్నీ ఎందుకూ, హాయిగా కడుపు నిండా దిబ్బ రొట్టెతిని, కళ్ళుమూసుకు పడుకో" అని సలహా యిచ్చింది.

మహాకవిని అడిగితే అలా సెలవిచ్చాడు. నాయనమ్మని అడిగితే ఇలా సలహాఇచ్చింది. కల్చర్ అంటే ఈ రెండింటికీ మధ్యస్తంగా ఉంటుందో అన్న అనుమానం వేయడంలో ఆశ్చర్యంలేదు. మహాకవులకీ, మహాశయులకీ, మహానుభావులకీ, ఇలాంటి మహామహా వాళ్ళకి, చులకనగా, తేలిగ్గా చూడతగ్గంత సర్వసాధారణమైనదీ, నాయనమ్మలకి అదేమిటయినా ఫరవాలేనిదీ కల్చర్ కామోసు అని తేల్చుకొన్నా.

వాస్తవానికి కల్చరంటే ఏమిటో నాకు తెలియకకాదు, ఇంత తాపత్రయపడి అదేమిటో తెలుసుకోడానికి ప్రయత్నించడం. కల్చర్ గలవాళ్ళని కొంతమందిని నేను కలుసుకొన్నాను. వాళ్ళ పరిచయదౌర్భాగ్యం కలగడం నా దురదృష్టం. బొంబాయిలో ఒక పెద్దమనిషి నాకింకో పెద్దమనిషిని పరిచయం చేశాడు. ఆ పెద్దమనిషికి చాలాచాలా కల్చరుందట! ఈ విషయం పరిచయం చేస్తున్న పెద్దమనిషే నాకు హెచ్చరిక చేశాడు. ఆ పెద్దపెద్దమనిషిలోని కల్చరేం నాకళ్ళకి కనబడలేదు. నా మొహంగాని, కల్చర్ కళ్ళకి కనబడుతుందా. అది అనిర్వచనీయమైన అవ్యాజ పరబ్రహ్మ పదార్థంలాంటిది గాబోలు.—గాని పెద్ద పెద్ద మనిషి గారి మాటలనిబట్టి కల్చరంటే ఏమిటో పోల్చేసుకొన్నా.

ఆరుద్ర

ఆయన మాట్లాడితే ప్రతీ రెండో వాక్యంలో "షా చెప్పినట్టూ, చూడండీ, అరిస్టాటిల్ అన్నట్టు – కారల్ మార్క్సు ఏమన్నాడంటే" అంటూ చాలాచాలా గొప్ప గొప్ప వాళ్ళ పేర్లు లాక్కొచ్చాడు. అప్పుడు కల్చరంటే ఏమిటో నాకు బోధపడిపోయింది. పెద్ద పెద్దవాడిగా చెలామణీఅవడానికి గొప్ప గొప్పవాళ్ళు చెప్పిందంతా తెలిసుండాలని. మామ్మూలువాళ్ళు కూడా మాట్లాడుతున్నప్పుడు అప్పుడప్పుడు ఏదో శాస్త్రం చెప్పినట్టు అని అంటూఉంటుంటే—ఆ అంటూ ఉండడంలోనే ఉంటూఉన్న దన్నమాట ఈ కల్చరనే దానికి బీజం. మనం చెప్పే దానికి, ప్రాచీన ప్రమాణాలు, సాధికారమైన ఉదాహరణలో చెప్పడమే కల్చర్ కి ఆయువుపట్టు కాబట్టి, మీకు మనవిచేస్తున్న ఈ రెండు ముక్కల్లో ఉదహరించే నిమిత్తం సంస్కృతికి నిర్వచనం ఏమిటో చెప్పమని మహాకవినీ, మా నాయనమ్మనీ, ప్రార్థించాను. వాళ్లు కాస్తా అలా చేశారు.

పోనీ ఏం చేస్తాను. కల్చర్ అనగా సంస్కృతి, అనగా పెద్దపెద్దమనిషితనం, అనగా గొప్పగొప్పవాడితనం, లేక సర్వజ్ఞత్వంలో సంగోరుభాగం ఇవేవీ లేనివాడి లాగే ఏదో వేసనుకొంటున్న నాలుగు ముక్కలూ మనవిచేస్తా చిత్తగించండి.

ప్రతీమనిషి పుట్టేటప్పుడే, రెండు కళ్ళతోటీ రెండుకాళ్ళతోటీ పుట్టేటట్టు ఇంత సంస్కృతితో పుట్టడు. అలా పుట్టినవాడు గిట్టేలోపుగా పెరిగి పెద్దవాడయితే, అతగాడు ఆకళించుకొన్నది, అవగాహన చేసుకొన్నది ఆనవాయితీగా వస్తున్నదానిని అనుసరిస్తున్నదీ అంతా కలిపి వెరసి సంస్కృతి అని చెప్పుకోవచ్చు. చరిత్ర, సాహిత్యం, విజ్ఞానం, సంప్రదాయం, ఆచార వ్యవహారాలు ఇవన్నీ కాకుండా, ఇవన్నీ అవుతూ వీటన్నిటినిగ్గూ, చదువు గిదువు, సదసద్వివేకం, సహృదయత, సరసత అనే వాటిని కలిపి జాతీయత అనే అమాందస్తాలో వేసి మర్దించి మర్దించి అర్థంచేసుకొని నెత్తికీ, ఒంటికి, ఇంటికి పట్టించుకొన్నదే కల్చరని నా ఉద్దేశం. ఇది నేచురల్ గా, సహజంగా దానంతట అదే అబ్బుతుందని తమలాంటి వాళ్ళు అభిప్రాయపడి దాన్ని తెచ్చిపెట్టుకొందికి అడ్డదారులు వెదకవలసిన అవసరం ఏముందా అని నన్ను ప్రశ్నించవచ్చు.

అవసరం ఉంది. అడ్డదారులు వెదకాలి. లోకం మారుతూంది చూడండి. దాంతోటి సంస్కృతియొక్క కొలతలు కూడా మారి పోతున్నాయి. మనకి స్వరాజ్యం రాక ముందు అధికారవర్గాలకీ, వాళ్ళ చుట్టూ వున్న వాళ్ళకి కల్చరంటే ఒక అభిప్రాయం ఉండేది. అలాగే అనధికారవర్గాలవారికీ, వారిచుట్టూఉండే వాళ్లకి మరొక అభిప్రాయం ఉండేది. స్వరాజ్యం వచ్చేక ఇది మారి పోయింది. ఆంధ్రరాష్ట్రం వచ్చాక మనకి కొద్దిగా, మారుతుంది. మనకి స్వతంత్రం వచ్చేక సంస్కృతికి మరీ గిరాకీ తగిలింది. దేశదేశాలనుంచి, రకరకాల సంస్కృతీ రాయబారవర్గాలు ఆరోజూ కారోజూ మనకి దిగుమతి అయిపోతున్నాయి. మన దేశంనుంచి అధికార, అనధికార సంస్కృతీ రాయబారకూటాలు ఎగుమతి అవుతున్నాయి. మనదేశంలోకి దిగబడుతున్న వాడికోసం మనం ఎగబడుతున్నాం. మనం పైదేశాలకి రవాణా చేస్తున్న వాటిని విదేశీయులు చూచి తలలూచి కరతాళ ధ్వనులమధ్య పేనోళ్ళ పొగుడుతున్నారు. ఇటువంటి శుభసమయంలో, చరిత్రాత్మకమైన చరితార్థమైన దివ్యతరుణంలో సంస్కృతి అంటే ఏమిటో

# కుర్చీలో కూనిరాగం

దాన్ని సాధించడానికి దారి సుదూరం కాబట్టి అడ్డదారిని బడి దాన్ని తెచ్చి పెట్టుకోడానికి కొన్ని కిటుకులు తెలుసుకోడం క్షేమకరం.

మనదేశాని కొస్తున్న సంస్కృతి రాయబారవర్గాలలో ఎవరెవరున్నారో ఏ ఏ డిపార్టుమెంటుల సంస్కృతుందో చూస్తే కిటుకుల కీలకం మనకి తెలిసిపోతుంది.

కవులు - నాట్యంచేసేవాళ్లు, వాళ్ళవాళ దేశాలలో వాళ్ళ వాళ్ళ పల్లెటిదిక్కు, పాటలు పాడేవాళ్ళు, సంగీతం పాడేవాళ్ళు జంత్రాలు వాయించే ళ్ళు వీటన్నిటినీ మించి వీటన్నిటినీ గురించి మాటాడేవాళ్ళు వీళ్ళంతా సంస్కృతికి ప్రతినిధులన్న మాట. వాళ్లలాగ మాట్లాడగలగడం, లేకపోతే వాళ్లు ఆడేదీ పాడేదీ అర్థంచేసుకోగలగడం, సరైన సందర్భాల్లో సరిగ్గా చప్పట్లు కొట్టగలగడం నేర్చేసుకొంటే మనకి సంస్కృతిలేదని ఎవడూ చెప్పడానికి సాహసించడు.

పాతచింతకాయపచ్చడిలాగ, అతిప్రాచీన, అతిపురాతనమైన కిటుకు ఇంకోటి ఉంది. అదేవిటంటే - మనవిచేస్తున్నా. శతశ్లోకీ నపండితః అని ఒక చిన్న సూత్రం ఉంది. నూరుశ్లోకాలు వచ్చినవాడు పండితుడుకాడు అని దానిభావం. గాని శతశ్లోకేన పండితః అని అంటే నూరుశ్లోకాలు వచ్చినవాడు పండితుడు అని మార్చేశారు. అది సంస్కృతి సాధించడానికి అడ్డదారిగా పనికొస్తుంది. వందకాకపోయినా, సత్యనారాయణవ్రతంలో చెప్పినట్టు బంగారం అంత ఓపిక లేకపోతే వెండి - దానికీ సత్తువలేకపోతే రాగి - దానికీ గతి లేకపోతే ఇత్తడి అన్నట్టు వందకాకపోతే, యాభైలేకపోతే పాతిక పద్యాలు, శ్లోకాలు, సుభాషితాలు కంఠతా పెట్టండి. అవకాశం వచ్చినప్పుడల్లా రాకపోయినా ఇబ్బందిలేదు. తెచ్చుకోవాలి - అడ్డమైనవాళ్ళదగ్గరా, అడ్డంకాని వాళ్ళదగ్గర అవియా కరువుపెట్టండి. పడికట్టు రాళ్ళలాగ కనబడ్డా ఈ పదాలు పాదాలూ, పద్యాలూ మనలో గల సంస్కృతిని బయటికి చూపెట్టే సాధనాలు. మనకి స్వతంత్రం రాకముందూ ఇంగ్లీషులోవి అప్పుడప్పుడు అనడం సంస్కృతికి గుర్తు. స్వతంత్రం వచ్చేక దేశవాళి, ప్యూర్ స్వదేశీ అనగా సంస్కృతం సామెతలు గుప్పించడం ఫాషన్.

భ్రమరకీటన్యాయం, తిలతండులన్యాయం, స్థాలీపులాకంగా, విపులాచపృధ్వీ, నందో రాజ భవిష్యతి, భ్రష్టస్యకావాగతిః మొదలైన రడీమేడ్ మాటలు కొన్ని పనికొస్తాయి. ఉపనిషత్తుల్లోకి, భగవద్గీతలలోకి పోవడం మరీ మంచిది. అట్టే సంస్కృతి లేకపోయినా, అడ్డదారిని అన్నీ సాధించి అమోఘవిజయాలని పొందినవాళ్లలో అగ్రగణ్యుడు శ్రీజిత్ ఎన్. గిరీశంగారు. ఇతగాడు ఏదో నోటకొచ్చిన పద్యము—

ఖగపతి అమృతం తేగా
భుగభుగమని పొంగి చుక్క భూమిని
వ్రాలెన్

పొగచెట్టై జన్మించెను
పొగతాగని వాడు దున్నపోతై పుట్టున్.

అని చదివిపారేసి ఇది బృహన్నారదీయం నాలుగో అశ్వాసంలో ఉంది చూసుకో అన్నాడు. వెంకటేశం నమ్మేశాడు. దమయంతి రెండో పెళ్ళికి ధరనుండే రాజులెల్ల దడదడవచిరీ. అని దడదడచదివేసి ఇది మరేదో పుస్తకంలో ఉందన్నాడు. పాపం పూర్ గర్ల్ బుచ్చెమ్మ నమ్మక తప్పిందికాదు. వెంకటేశం దృష్టిలో, బుచ్చెమ్మ ఉద్దేశంలో గిరీశంగారు ఎంతో గొప్పవారు, అన్నీ తెలిసినవారు అనగా బోల్డంత కల్చెరున్నవారు. మనంకూడా పూజ్యులు, గురుపాదులు అయిన శ్రీ గిరీశంగారి అడ్డదారినిపోతే ఇట్టే సంస్కృతిని సాధించేస్తాం. అయితే గిరీశంగారి లాగే మనకన్నా తక్కువ చదువుకొన్నవాళ్ళ దగ్గరా, కొంచెం తెలిసినవాళ్ళదగ్గరా ఇలా ఠస్సాలు చెప్పి రంజింపచేస్తేనే మంచిది. లేకపోతే మన యొక్క దేహారోగ్యానికి కొద్దిగా భంగం వాటిల్లవచ్చు.

మనకన్నా హెచ్చు తెలిసినవాళ్ళదగ్గర కూడా వాళ్లకన్నా ఎక్కువ తెలిసినట్టు నటించి మనకి మరీ కల్చరున్నట్టు బుజువు చేసుకోవచ్చు. మళ్ళా గిరీశంగారి ఉదాహరణే తీసుకోండి. సౌజన్యరావు పంతులుగారిదగ్గర శ్రీమాన్ మిస్టర్ గిరీశంగారు షేక్స్పియరుగారు చెప్పిన వాటీజ్ ఇన్ ఎ నేమ్ అన్న సూక్తిని పేరులోన ఏమి పెన్నిధి ఉన్నది అనేఆటవెలదిముక్కలోకి తర్జుమాచేసి భేష్ అనిపించుకొన్నారు. అలాగే మనం కూడా కొద్దిపాటి తెలివితేటలతో సంస్కృతికి అడ్డదారిని పట్టుకోవచ్చు.

మరో చిన్న కిటుకు. కళ్లూ, చెవులూ లేని ముసలమ్మ వీధిభాగోతంచూసి మెచ్చుకోడం జ్ఞాపకం ఉందా. అంతా నవ్వుతున్నప్పుడు మెచ్చుకొంటున్నప్పుడు నన్ను కాస్త గిల్లితే నేనూ నవ్వుతానందట. నవ్వుతానన్న ఆవిడ తెల్లారేక నవ్వుతాలపాలయింది గాని ఆవిడ సూత్రం కొద్దిగా ఆధునిక పరిస్థితులకి అనువుగా మనం మార్చేస్తే మనకో అడ్డదారి దొరుకుతుంది. పెద్ద పెద్ద పాటకచేరీలు జరుగుతున్నాయి అనుకోండి. పాటగాడు ఏదో పాడేస్తూఉంటే వినేవాళ్లలో కొందరు అప్పుడప్పుడు ఏకగ్రీవంగా వహ్వా—భేష్—సెభాష్ అని అరుస్తూ ఉంటారు. ఎందుకు వహ్వా అనాలో ఎక్కడ భేష్ అనాలో ఎలా సెభాష్ అనాలో మనకి తెలియదనుకోండి. అయినా ఇబ్బంది లేదు. వాళ్ళంతా అలా అనేటప్పుడు వాళ్లతో పాటు మనంకూడా, వాళ్ళకన్నా బిగ్గరగా మెచ్చుకొంటే వాళ్ళకున్నంత సంస్కృతి మనకికూడా ఉందనుకొంటారు. ఇక పోతే చిత్రకళా ప్రదర్శనా లుంటాయి. అక్కడ కూడా మన సంస్కృతిని ప్రదర్శించడానికి అడ్డదారులుంటాయి. ఆధునిక చిత్రకళ, ఆమాటకొస్తే ప్రాచీన చిత్రకళ కూడా మనకి తెలియకపోయినా ఇబ్బంది లేదు. ఏ బొమ్మదగ్గర పదిమంది గుమిగూడుతున్నారో ఆ బొమ్మదగ్గర మనంకూడా ఓ గడియసేపు నించుంటే సరి. ఇంతకన్నా గట్టికిటుకు ఇంకొకటి ఉంది. ఒక బొమ్మదగ్గర నిలబడి తదేకదృషితో దాన్ని చూసి, ఆ బొమ్మని అడుగుదూరంనుంచి, పదడుగుల దూరందాకా కొంచెం వెనక్కు వెళ్ళి కొంచెం దగ్గరకొచ్చి, ఈపక్కనుంచి, ఆపక్కనుంచి పరిశీలించి మనం పరీక్షగా చూస్తున్నట్టు పదిమందికీ తెలిసేటట్టు చేసుకొంటే మనకీ ఎంతో సంస్కృతిఉన్నట్టు తెలియవచ్చు. ఎంతో తెలిసినవాడుకాకపోతే అంత కూలంకషంగా ఎందుకు చూస్తాడు. అని వాళ్లనుకొంటారు. లేతతోటకూరకాడలలాంటి చేతులు, టి. బీ. పేషెంటుల్లాంటి ఆకారాలుఉన్న ఆడవాళ్లని మగవాళ్లని వేసే ఆర్టిస్టుని అంతా గొప్ప చిత్రకారుడంటున్నారనుకోండి. మీరూ వప్పుకోండి. మీరు సంస్కృతికివెళ్ళే హైరోడ్డుమీద ఉన్నట్టేలెక్క. ఇక ఆధునిక చిత్రకళ ఒకటుంది. అదిమహామహావాళ్లకేబోధపడదు. అయినా దాన్ని వాళ్ళు హర్షిస్తూఉంటారు. అది తలకిందులాఉందో ఎటు పక్కదాని మట్టమో తెలియకపోయినా ఇబ్బంది లేదు. పికాసోలాగ ప్రయత్నించినా ఆర్టిస్టులో ఏదో ఉందని మీరు అనండి. క్యూబిజం, ఇంప్రెషనిజం, మొదలైనవి అతడిమీద పని చేశాయి - అని మీకు తెలిసినట్టు అందరికీ తెలియచేస్తే మీరు సంస్కృతిగలవాళ్లలాగ చెలామణీ అయిపోతారు. మీరు బంగారప్పిచుకలై మీదగ్గర డబ్బు మూలుగుతూ ఉంటే అందరూ మెచ్చుకొంటున్న చిత్రాలలో కొన్ని కొనేయండి. మీ సంస్కృతికి విలువకూడా ఉంటుంది. మీరు డబ్బున్నవాళ్లయితే సంస్కృతికి ఎన్నో అడ్డదారులు చేస్తాను. సంస్కృతి ఉన్నట్టు నటించడం శ్రీమంతులకి చాలా ముఖ్యం. మీరేదో పనిమీద పైదేశాలకి వెళుతున్నారనుకోండి. కొద్దిగా డబ్బు ఖర్చుపెట్టి వెళ్లేముందు ఒక చిన్న మీటింగు పెట్టించండి. మీ మెడలో నాలుగుదండలు వేయించుకోండి. ఆ దేశానికి, అనధికారంగా వెళుతున్న సాంస్కృతిక రాయబారవర్గంలోని ఏకైక ప్రతినిధిగా మీ భుజస్కంధాలమీద పురజనుల కోరికమీద కొంత భారాన్ని పెట్టించుకోండి. ఆ దేశం వెళ్లాక మీ వ్యాపారం మీరు చేసుకొని చూసుకొని చక్కా వచ్చేయండి. వచ్చేక మరో మీటింగు పెట్టించుకొని, మరికొన్ని [illegible] దండలు వేయించుకోండి. అక్కడ తీసిన ఫొటోగ్రాఫులు గట్రా నలుగురికి చూపెట్టండి. ఆ దేశం కబుర్లు నాలుగు చెప్పండి. ఈ సంగతులు దినపత్రికలవాళ్ళు అచ్చువేశారా సరేసరి. లేకపోతే డబ్బిచ్చి ప్రకటనగా మీరే వేయించుకోవచ్చు. మీ వ్యాపారం మీరు చేసుకొంటూఉంటే అది నలుగురికి లాభించి పదిమందీ మెచ్చుకొన్నారనుకోండి. అది అదనుగా తీసుకొని ఓ రెండు సన్మానాలు చేయించుకొంటే మీ సంస్కృతికి మరి ఢోకా ఉండదు.

ఇన్ని రకాల అడ్డదారులలో పడి చాలామంది సంస్కృతిని సాధించుతున్నారు గాని మనంకూడా అలా చేస్తే కొద్దిగా ఔచిత్యం పాటించడం అవసరం. లేకపోతే చెడిసికొడుతుంది. ఔచిత్యం అంటే సందర్భశుద్ధి అన్నమాట. ఒక చిన్న ఉదాహరణమాడిండి. మామూలుగా మన ఊళ్లలో సంతర్పణలు అవీ అవుతున్నప్పుడు-మజ్జిగా అన్నం కలిపేవేళకి కొద్దిగా ముందుగా కొందరు కస్తూరీ తిలకంలాంటి శ్లోకాలు చదవడం తక్కినవాళ్లు "భోజనకాలే నమః పార్వతీ పతే హరహర మహాదేవ" అని అరవడం కద్దు. అదొక రకమయిన సంస్కృతి. ఒక సంతర్పణలో - సంస్కృతికోసం నేను చెప్పిన అడ్డదారులలో కృషిచేసిన ఒకానొక బుద్ధిమంతుడు తక్కినవాళ్ళంతా ఏవేవో శ్లోకాలూ, పద్యాలూ, చదువుతూ ఉండగా "నేనేనా తక్కువతిన్నాను. (నిజానికి సంతర్పణలో అందరికన్నా అతడే ఎక్కువ తిన్నాడులెండి) నేనుమట్టుకు వీళ్ళలా చదవలేనా" అని "ఉప్పుకప్పురంబు ఒక్కపోలికనుండు" అని తనకి జ్ఞాపకం ఉన్న పద్యం కాస్తా చదివాడు. తరవాత ఏమయిందో మీరే ఊహించుకోగలరు. సంస్కృతికి సీదా రాస్తాలో వెళ్ళడం వీలుపడకపోతే అడ్డదారిని వెళ్ళడం మంచిదేగాని "ఉప్పుకప్పురంబు" పద్యం చదివిన స్నేహితుడిలాగ ముళ్లకంపనీ, గాజుపెంకుల గోడని దాటి సంస్కృతిని సాధించకపోవడం సర్వోత్తమం. (ఈ సంగతే మొన్న రేడియోలో చెప్పాను మీరు వినిపించుకొన్నారో లేదో అని మళ్ళీ చెప్తున్నాను.) ★

పెద్ద కథ:

# ఉద్యోగాలు

(గతసంచిక తరువాయి)

పడుకున్నాడన్నమాటేకాని నిద్రపట్టలేదు. రైలులో నిద్రపోయే అలవాటు అతనికసలెప్పుడూ లేదు. హోటలుతిండి పైత్యంచి తలదిమ్మెక్కింది. ఆలోచనలతోటి అది రెట్టింపయింది. చోటుకోసం తగాదాలతోటి, సినిమాపాటలతోటీ రాజకీయ చర్చలతోటీ, వస్తువులు తినుబండారాలు అమ్ముకునేవారి అరుపులతోటీ. పిల్లల యేడ్పులతో, తల్లుల సముదాయింపులతో పెట్టె గంద్రగోళంగావుంది. నిద్రపట్టే అవకాశం యెంతమాత్రం లేదు. "ఇంటిదగ్గర వచ్చే ఉపద్రవాన్ని ఎల్లాగ యెదుర్కోవాలీ" అని ఆలోచిస్తూ పడుకున్నాడు.

* * *

మర్నాడుదయం ఎనిమిది గంటలకు యింటికి చేరేడు. యిల్లంతా అతి హడావుడిగా వుంది. తను మద్రాసు వెళ్లిన మూడో రోజున విశాలాక్షి, రంగారావు పిల్లలు వచ్చేరు. బావ రంగారావు బి. ఏ. బి.యిడి ప్యాసై...... హైస్కూలులో మాష్టరుగా చేస్తున్నాడు. విశాలాక్షి పురిటికి పుట్టింటికి వచ్చింది. వీధిగుమ్మంలో రంగారావు శర్మని చూడగానే "ఏమోయి. గురజాడ అప్పారావుగారి వెంకటేశంలాగ షేక్స్పియర్ మొహం వేసుకుని వచ్చేవు: వెళ్లిన పనైందా" అన్నాడు.

"నేనువెళ్లింది ఇంటర్వ్యూకి. అయింది. వచ్చాను" అన్నాడు ముక్తసరిగా. తల్లి లోపలనుంచి గబగబావచ్చింది. "ఉద్యోగమేమన్నా దొరికిందిరా అబ్బాయా!" అంది.

"ఆ! జేబులో వేసుకొని తెచ్చేను" అన్నాడు తను.

"సరేలే. వీటికేంగాని అసలు సంగతేమిటో చెపుదూ" అంది ఆమె. తర్వాత దొడ్లోంచి తండ్రివచ్చేడు. ప్రశ్నతర్వాత ప్రశ్న నెమ్మదిగా అడిగేడు. లెక్కలతనిఖీ డిపార్టుమెంటు ఇంటర్వ్యూని వివరంగా చెప్పేడుశర్మ. తనకా వుద్యోగం వచ్చే సావకాశం యెంతమాత్రం లేదని కూడా తేల్చి చెప్పేశాడు.

"అయితే. బ్యాంక్ ఉద్యోగం సంగతేమిటి?" అన్నాడు తండ్రి కొంచము చిరాకుగా.

గుటకలు వేయటం మొదలుపెట్టేడు శర్మ. మద్రాసు వదలినది లగాయతు ఆలోచిస్తున్నాడేకాని యేమి సమాధానం చెప్పాలో మాత్రం నిర్ణయించుకోలేక పోయేడు.

"అదీ అంతే అయింది" అన్నాడు ముక్తసరిగా.

"అంటే? అసలు ఇంటర్వ్యూకి వెళ్లేవా లేదా?" అన్నాడు తండ్రి.

"ఈ అనుమానం యెందుకు రావాలీ?" అన్నాడు శర్మ భయపడుతూ. శర్మ చేసిన పాపమేమిటో కాని అతనిమనసులోని విషయాలు మొహం స్పష్టంగా చెప్పేస్తూ వుంటుంది.

"మొదటినుంచీ ఆ వుద్యోగానికి వ్యతిరేకంగా వున్నావు. నువ్వు కనీసం ఇంటర్వ్యూకేనా వెళ్ళలేదని నాకు తెలుసు" అన్నాడు కోపంగా తండ్రి. శర్మ బ్యాంక్ దగ్గర జరిగిన విషయాలన్నీ స్పష్టంగా చెప్పేసేడు దాచటంవల్ల ప్రయోజనం ఆట్టే వుండదని.

## జె. పరబ్రహ్మం

"ఆ వుద్యోగానికి స్కూలు ఫైనల్ చాలట. నాకు అదనంగా అనవసరమైన డిగ్రీలు చాలా వున్నాయి. ఇవి వారికక్కరలేదట" అన్నాడు ధైర్యం తెచ్చుకొని.

"ఇటువంటి తెలివితేటలు. నీకు అపరిమితంగా వున్నాయని నాకు తెలుసు." నీవు ఇంటర్వ్యూకి వెళ్ళలేదని నాకు విచారం లేదు. నీవు వెళ్ళినా వెళ్ళకపోయినా ఫలితం ఒక్కటే. నీ అమాయకత్వానికి మాత్రమే నేను బాధపడుతున్నాను" అన్నాడుతండ్రి

శర్మ చిన్నపుచ్చుకున్నాడు. మాట్లాడటానికికూడా ప్రయత్నించలేదు. రంగారావు నవ్వుతూ "ఇంతవరకూ నువ్వు చేసిన తెలివైనపనులలో యిదొకటి" అన్నాడు. "ఏదీ?" అంది విశాలాక్షి.

"ఇంటర్వ్యూ ప్రమాదాన్ని తప్పించుకొని క్షేమంగా తిరిగి రావటం" అన్నాడు రంగారావు.

"హాస్యానికి కూడా ఒక హద్దుండాలి" అంది విశాలాక్షి.

"ఇందులో హాస్యమేముందీ? మా తమ్ముడికి జిల్లాకలెక్టరుకు కావలసిన తెలివితేటలున్నాయి గుమాస్తా వుద్యోగానికి వెళ్ళమంటే యెల్లాగ వెడతాడు?" అన్నాడు.

శర్మ ఇంకక్కడ నిలబడలేక పోయేడు. తిన్నగా తన గదిలోకి వెళ్ళేడు. తన సమస్య మళ్ళీ మొదటికే వచ్చింది. రోజంతా యెవరితోనూ మాట్లాడకుండా పెరల్ బక్ వ్రాసిన అదర్ గాడ్స్ అనే నవలను చదువుకుంటూ కూర్చున్నాడు.

"అయిందేదో అయింది. ఇకముందు ఇటువంటి పొరపాట్లు రాకుండా చూసుకోవాలి." అంది రాజ్యం.

"నేను చేసింది పొరపాటు అని నేననుకోవటం లేదు." అన్నాడు శర్మ.

"మీకు తోచదు. ఒకరు చెప్పినట్టు వినరు. అది మీ స్వభావం" అంది రాజ్యం. రెండోరోజున రంగారావు ప్రయాణమయ్యేడు.

"మీ స్కూల్లో మేష్టరీ ఉద్యోగాలు ఖాళీవస్తే మావాడికి చెప్పి పుణ్యం కట్టుకుందూ" అంది శర్మ తల్లి.

"అటువంటివివాడిహోదాకు పనికిరావు" అన్నాడు తండ్రి వెటకారంగా.

మర్నాడు కృష్ణారావు వచ్చేడు. కృష్ణారావంటే శర్మకు కొండంత సరదా. శర్మా కృష్ణారావులు చిన్నప్పుడు ఒకే క్లాసు చదువుకున్నారు. కృష్ణారావుకు ఆడిన అబద్ధం మళ్ళీ ఆడకుండా యెటువంటివానినైనా టోకరాకొట్టే నేర్పరితనం పుట్టుకతోటేవుంది. కర్ణంగారి అబ్బాయి రాఘవరావు యింకో సహాధ్యాయి. వీళ్లిద్దరికంటే శర్మ రెండుమూడేళ్ళు చిన్న. కృష్ణారావు రెండవ ఫారంలో తప్పిపోయి వెనకబడి పోయేడు. తర్వాత ప్రతిక్లాసు రెండేసి సార్లు చూసుకుంటూ ఫిఫ్త్‌ఫారంతో విద్య సమాప్తం చేసేడు. ప్రస్తుతం ఒక మందుల కంపెనీకి ఏజంటుగా పనిచేస్తున్నాడు. ఆపనిలో అతను చాల సమర్థుడు. కంపెనీవారు అతనికి స్పెషల్ ఇంక్రిమెంట్సుకూడా యిచ్చేరు. అతని జీతం ఎలవెన్సులు, టి. ఏలు, వేటాలు కలిపి నాలుగువందల రూపాయలవరకూ వస్తున్నాయి. కృష్ణారావుకు శర్మ అంటే యెంతో గౌరవం. చిన్నప్పుడు శర్మదగ్గర లెక్కలు, ఇంగ్లీషు చెప్పించుకునేవాడు. శర్మవంటి తెలివైనవాడిని సరిగా ఉపయో

గించుకోలేకపోవటం ఈదేశంయొక్క లోప మనుకున్నాడు.

కృష్ణారావు ఒక పిల్లలకోడి. చిన్నప్పుడేల్లావున్నా యిప్పుడెంతో బాధ్యత తెలిసినవాడులాగ కనబడుతున్నాడు. ఒక పెద్ద సంసారాన్ని యీదుకొని వస్తున్నాడు.

"నువ్వు చాల అదృష్టవంతుడివిరా" అన్నాడు శర్మ.

"యేమి' అదృష్టంరా. నెలకు పాతిక రోజులు తిరగాలి. సత్రంభోజనం మఠం నిద్రలాగ వుంది నా బ్రతుకు. ఈ పాతిక రోజుల్లోనూ ఏపిల్లలకు జబ్బుచేసినా చూసే దిక్కులేదు. నేను యిల్లు వదిలితే యెక్కడ వుంటానో యెవరికీ తెలియదు"అన్నాడు.

"ఔను యెవరిబాధలువారికివుంటాయి" అనుకున్నాడు శర్మ

"బై ది బై. రాఘవరావు ప్యాసయ్యేడురా?" అన్నాడు కృష్ణారావు.

"ఏమోరా! వాడు నాకు నెంబరుకూడా చెప్పలేదు" అన్నాడు శర్మ.

"వాడెప్పుడూ అంతేలే. ఒకవేళ చెప్పినా ఆ నెంబరును నమ్మటానికివీల్లేదు" అన్నాడు కృష్ణారావు.

రాఘవరావూ శర్మ స్కూలు ఫైనల్ వరకూ సమానంగా వచ్చేరు. అయితే స్కూలు ఫైనల్‌లో రెండుసార్లు తప్పిపోయేడు. అప్పటినుంచి శర్మను తప్పించుకొని తిరిగేవాడు. అసలు శర్మ అంటే అతనికి మొదటినుండీ అసూయే. ఈసంగతి శర్మకు తెలిసినా తెలియకపోయినా కృష్ణారావుకు పూర్తిగా తెలుసు. స్కూలుఫైనల్ పూర్తికాగానే శర్మ... కాలేజీలో చేరేడు. రాఘవరావునుచూసినప్పుడల్లా కృష్ణారావు "శర్మని చూసి యేడవకపోతే నన్ను చూసి సంతోషించకూడదురా?" అనేవాడు.

"పోనిలేరా. పునాది గట్టిపడుతుంది" అంటూవుండేవాడు రాఘవరావు.

రాఘవరావు మళ్లీయేడుకూడా తప్పేడు. తర్వాత యింటర్మీడియెట్ చదివి నాల్గవసారి ప్యాసయ్యేడు. తర్వాత బి. యే. లో చేరేడు. బి. యే. చదువుతుండగానే రాఘవరావు వివాహం అతివైభవంగా జరిగింది. అత్తవారు చాలా భాగ్యవంతులు. పెళ్ళికి పేరుపొందిన ఒక సినిమాతార నాట్యప్రదర్శనంకూడా యేర్పాటు చేసేరు ఆవూరిలో ఈతరంలో జరిగిన ముఖ్య సంఘటనలలో రాఘవరావు వివాహం ఒకటి అని చెప్పకోవచ్చు.

యువతి: ఈ పుస్తకము తీసుకొని నా డబ్బు నాకు ఇచ్చేస్తారా?

షాపు యజమాని: ఏమండి అచ్చు బాగోలేదా!

యువతి: ముగింపు బాగోలేదు.

—వల్లూరి రామారావు, బందరు.

శర్మ వివాహం అంతకు పూర్వమే తిరుపతిలో అతి నిరాడంబరంగా జరిగింది. "ఒక్కొక్కరి జాతకమహాత్మ్యం అటువంటిది" అనుకున్నాడు కృష్ణారావు. రాఘవరావు బి. యే. రెండుసార్లలో ఒకటి రెండు భాగాలు పూర్తిచేసేడు. మూడవ భాగానికి నాల్గవతడవ సెప్టెంబరుకు వెళ్లేడు. కృష్ణారావు రాఘవరావును చూసి "భాయీ! పునాది యెంతవరకూ గట్టిపడింది?" అని అడిగేడు.

"పోనీలేరా, మనకంటె ముందు ప్యాసైనవారు యేం బావుకున్నారు?" అన్నాడు రాఘరావవు.

శర్మ మెద్రాసులో వుండగా బి. యే. పరీక్ష ఫలితాలు పేపర్లో పడ్డాయి. అయితే రాఘురావరావు నెంబరు తనకు తెలియదు. అయినా తను తన హడావుడిలో మునిగివున్నాడు.

శర్మ కృష్ణారావులు కలిసి రాఘవరావు యింటికి వెళ్ళేరు. రాఘవరావు వూళ్ళో లేడని బి. యే. ప్యాసయ్యేడని, సాయంత్రానికి రావచ్చునని రాఘవరావు తండ్రి చెప్పేడు. అక్కడ యిల్లంతా హడావుడిగా వుంది. గోడలకు వెల్లలు కొట్టించటం తలుపులకు రంగులు వేయటం మొదలైన పనులు చురుకుగా జరుగుతున్నాయి.

సాయంత్రం శర్మ కృష్ణారావు యింటికి వెళ్ళేడు. బైటవరండాలో కూర్చొని మాట్లాడుతూ వుండగా రాఘవరావు ఒక శుభలేఖలకట్ట పుచ్చుకొని సైకిల్ మీద వచ్చేడు.

శర్మని చూడగానే "హలో! ప్రొఫెసర్ గుడ్‌మార్నింగ్" అన్నాడు.

"కంగ్రాచ్యులేషన్స్. నువ్వు చెప్పకపోతే మాకు తెలియదనుకున్నావా?" అన్నాడు శర్మ.

"నేను మీ యింటికి అరడజనుసార్లు వచ్చేను. పెద్దలు మెద్రాసు దయచేసేరని తెలిసింది. ఇక కృష్ణారావు యెప్పుడూ వూళ్ళోనే వుండడు." అన్నాడు రాఘవరావు.

తర్వాత అసలు విషయంలోకి దిగేరు. రాఘవరావు పత్నీసమేతంగా సత్యనారాయణవ్రతం చేసుకుంటున్నాడు. ఆ శుభలేఖలు వ్రతానికి ఆహ్వాన పత్రికలు. రెండు శుభలేఖలు తీసి ఒకదానిపై శర్మపేరు రెండోదానిపై కృష్ణారావు పేరు వ్రాసి వారివి వారికిచ్చేసేడు. ఆహ్వాన పత్రికలో రాఘవరావు. బి. యే. అనే మాటలు పెద్ద పెద్ద అక్షరాలతో ప్రాముఖ్యంగా వున్నాయి.

"ఇదంతా పరీక్షాఫలితాల పర్యవసానం అనుకుంటాను" అన్నాడు కృష్ణారావు.

# ★ ఉద్యోగాలు ★

"కాదోయి. పూర్వమే చేద్దామనుకున్నాం. పడలేదు. ఇప్పుడు చేస్తున్నాం"అన్నాడు రాఘవరావు.

వ్రతానికి శర్మ, కృష్ణారావులు సకుటుంబంగా వెళ్లేరు. రాఘవరావు ప్రతిభను వచ్చిన అతిథులంతా మెచ్చుకున్నారు. చురుకుతనం, శ్రద్ధ, పెద్దలపై గౌరవం మొదలైన సద్గుణాలన్నీ అతని సొత్తు అన్నారు. ప్రతివారి నాలుకమీదా రావు పేరే నాట్యంచేసింది.

కృష్ణారావు నవ్వుకున్నాడు... ఈప్రపంచం చాలా చిత్రమైనది. ప్రతివ్యక్తి తన చుట్టూ కృత్రిమమైన ఒక వాతావరణాన్ని కల్పించుకొని ఒక్కవెలుగు వెలగటానికి ప్రయత్నిస్తూ వుంటాడు. ఎవరిమీటింగులు వారే ఏర్పాటు చేయించుకొని ఉపన్యాసాలు దంచటం, ఎవరిదండలువారే కొనుక్కొని మెడలో వేయించుకోవటం, ఫోటోలు తీయించుకోవటం, పేపర్లలో వేయించుకోవటం సాధారణ విషయమై పోయింది...పాపం! శర్మమాత్రం ఇటువంటి ప్రపంచానికి భిన్నంగా వున్నాడు. నిజమైన అవకాశాలు అతని కన్నోవచ్చేయి. వాటిని వినియోగపరచుకోక తృణీకరించేడు. అతని విద్యార్థిదశలో అనేక బహుమానాలు వచ్చేయి. వాటిని అతడు పరోక్షంగా మాత్రమే తీసుకున్నాడు. శర్మకు రాఘవరావుకు యెంత తేడావుంది! వచ్చిన ప్రతిచిన్న అవకాశాన్ని పూర్తిగా ఆలోచించుకుంటూ నిశ్శబ్దంగా కూర్చున్నాడు కృష్ణారావు.

రాఘవరావు తనకంటె అదృష్టవంతుడు అనుకోవటం తప్ప ఇంకోవిధమైన ఆలోచన చేయలేదుశర్మ.

రాఘవరావు యెంత అట్టహాసం చేస్తున్నప్పటికీ మనస్సులో మాత్రం తృప్తిగాలేదు. అతని దృష్టికి శర్మ ఒక అగాధమైన మహాసముద్రంలాగ నిశ్చలంగా వున్నాడు. ఎంత చేసినప్పటికీ, యెంతమంది తన్ను భూషించినప్పటికి శర్మ అంతస్తువేరు. దానిని తను యెప్పుడూ అందుకోలేడు. ఈసమయంలో అతనిమనస్సును యెక్కువగా పీడిస్తున్నది ఈవిషయమే.

వ్రతానికి శర్మ తల్లీతండ్రీకూడా వచ్చేరు. రాఘవరావు చాకచక్యం చూసిన తర్వాత తమ కొడుకు వట్టి అప్రయోజకుడై పోతున్నా డనుకున్నారు.

ఇంటికి వెళ్ళినతర్వాత తల్లి "ఏ డేదేనా వుద్యోగం చూసుకుంటేకాని యింకెందుకూ పనికిరాడు" అంది.

"ఆ సంగతి నీకూ నాకూ తెలిసి యేం ప్రయోజనం? వాడికి తెలియాలికాని" అన్నాడు తండ్రి.

శర్మ యింక అక్కడ నిలబడలేక వెళ్ళిపోయేడు. తిన్నగా కృష్ణారావుయింటికి వెళ్ళేడు. కంపెనీవారి దగ్గరనుంచి యేదో టెలిగ్రాం వచ్చిందనిన్నీ కృష్ణారావు వెళ్ళిపోయేడనిన్నీ చెప్పేరు. అక్కడనుంచి తిన్నగా కాలువ వొడ్డుకుపోయి మెట్లమీద కూర్చుని తన పరిస్థితిని గూర్చి చాలసేపు ఆలోచించుకున్నాడు. "ఉద్యోగం రాకపోవటం కేవలం తన తప్పే అని అందరూ యెందుకనుకుంటున్నారో తెలియలేదు వారి కెంత తొందరగావుందో తన కంత కంటె నాలుగురెట్లు యెక్కువ తొందరగానే వుంది. అయితే వుద్యోగం సంపాదించటం యెట్లాగ? అదిమాత్రం యెవరూ చెప్పరు."..."ఉద్యోగం రాకపోవటం తన చదువు లోపమేకాని తనలోపం యెంత మాత్రం కాదు."

ఇంటర్మీడియట్ అవగానే యం. బి. బి. యస్ కాని ఇంజనీరింగ్ కాని చదువుదామనుకున్నాడు. కాని ఆ రెండింటిలోనూ సీటు రాలేదు. తనకు ఇంటర్మీడియెట్‌లో వచ్చిన క్లాసుకాని ర్యాంక్ కాని సీటు సంపాదించుకునేందుకు సహాయపడలేకపోయేయి. తనకంటె బాగా తక్కువ మార్కులు వచ్చిన అనేకమందికి సీట్లు వచ్చేయి. అదీ తన దురదృష్టమే ననుకున్నాడు.

ఈవిధంగా ఆలోచించుకుంటూ ఇంటికి చేరేటప్పటికి చాలా ప్రొద్దుపోయింది. ఎత్తిపొడుపుమాటలు మళ్ళీ ప్రారంభమయ్యేయి.

"నీ పనికి భోజనంచేయటానికి కూడా తీరిక లేనట్టుందే?" అన్నారు. శర్మ పైకి నిశ్చలంగావున్నా లోపల లోపల కుమిలిపోయేడు. అతని దుర్భరమైన పరిస్థితిని రాజ్యం గ్రహించింది. శర్మమీద క్రమేపీ ఆమెకు గౌరవం యెక్కువైంది." తన చేతిలోవున్న పరీక్షలు తిరుగులేకుండా ప్యాసయ్యేడు. ఉద్యోగానికి అదృష్టం కలిసిరావాలి. అందరూ కలిసి నిందిస్తే ప్రయోజన మేమిటి? మనసు పాడవటం తప్ప? శర్మకు యెంతో ధైర్యం చెప్పింది.

మర్నాడు రాజ్యం పుట్టింటికి తండ్రి పేర పరిస్థితులన్నీ వివరిస్తూ ఒక వుత్తరం వ్రాసింది. తిరుగు టపాలో శర్మ తండ్రికి ఒక ఉత్తరం వచ్చింది. పల్లెటూరిలోవుండి ఉద్యోగప్రయత్నం చేయటం కష్టమనిన్నీ ఒక వారంరోజులపాటు రాజ్యాన్నీ శర్మని తమవూరు పంపిస్తే ఉద్యోగ్రయత్నం చేయవచ్చునని వ్రాసేడు.

శర్మ కుటుంబంతో సహా అత్తవారింటికి చేరేడు. మామగారు, శర్మని తనకు తెలిసిన పెద్దమనుష్యులందరికీ పరిచయంచేసేడు. అవసరాన్నిబట్టి వారు ఉద్యోగప్రయత్నాలలో సహాయపడగలరని చెప్పేడు.

ఒకరోజు సాయంత్రం పార్కులో పెద్ద బహిరంగ సభ జరుగుతోందని తెలిసి శర్మ అక్కడకు వెళ్లేడు. అది వెనుకబడిన జాతుల వారి మహాసభ. వెనుకబడిన జాతులవారికి చెందిన మహానాయకులు చాలామంది వచ్చేరు.

శర్మ వెళ్లేటప్పటికి సభ ప్రారంభమైంది. ఒక కులమునకు చెందిన మహానాయకు

డుపన్యసిస్తున్నాడు. వారిజాతి వెనుకబడి వున్నదనీ, విద్యలో ఉద్యోగాలలో, ఆర్థిక రంగాలలో వారి జాతికి ప్రత్యేకమైన రక్షణలు కావాలని ఉపన్యాసం పూర్తిచేసేడు. ఇంకొక జాతినాయకుడు లేచి వారిది ఇంకా వెనకబడిన జాతి అనీ, వారికింకా యెక్కువ రక్షణలు కావాలన్నాడు. మూడవజాతి నాయకుడులేచి తాముపై వారి కంటేకూడా వెనకబడి వున్నామనీ అందరికంటె యెక్కువగా రక్షణలు తమకే కావాలని వాదించేడు. ఈ సమయంలో ఇంకో మహానాయకుడు వేదికమీదకువచ్చి గట్టిగా వుపన్యాసం ప్రారంభించేడు. "ఇంతవరకు తమ కులమువారిని ప్రభుత్వము వెనుకబడిన వారిక్రింద పరిగణించలేదనీ, తాముకూడా వెనుకబడి యుండుటకే నిశ్చయించుకున్నామనీ ఆ విషయమె గవర్నరుకు టెలిగ్రాము ద్వారా తెలియజేయనున్నామనీ, తమకు కూడా అందరితోబాటు ప్రత్యేకమైన రక్షణలు కావాలని ఈ సభవారు తీర్మానించాలనీ కోరేడు. కాని మొదటి నాయకుడు వెంటనే లేచి మీరు వెనకబడి లేరన్నాడు. సభలోని వారు కొందరు లేచి మేము వెనకబడే వున్నామన్నారు. ఇంకొక వైపునుంచి మరికొందరు లేచి మీరు యెంతమాత్రం వెనుకబడిలేరు అన్నారు. సభలో పెద్ద అలజడి ప్రారంభమైంది. దానిని అదుపులో పెట్టే శక్తి యెవరికీ లేకపోయింది. యే తీర్మానం చేయకుండానే సభను ముగించి నాయకులు వెళ్ళిపోయేరు. శర్మ తనలో "ఇదంతా యోగ్యతలతో నిమిత్తంలేకుండా ఉద్యోగాలు కావాలనే కుమ్ములాట తప్ప మరేమీ కాదనుకున్నాడు. తనకుమాత్రం పుట్టుకవల్ల, యం. ఏ. మొదటి తరగతిలో ప్యాసవటంవల్ల వెనుకబడి వుండటానికి యెంతమాత్రం సావకాశం లేకుండాపోయింది. ఇక తనకు ఉద్యోగం రావటమెట్లాగ?

శర్మ అత్తవారింటికి వెళ్ళిన ఆరవరోజున తండ్రిదగ్గరనుండి వుత్తరం వచ్చింది విశాలాక్షికి మొగపిల్లాడు పుట్టేడనీ, ఇంట్లో ఇబ్బందిగా వుందనీ, ఉద్యోగప్రయత్నాలు తర్వాత చేయవచ్చును కాబట్టి వెంటనే బయలుదేరి రమ్మనమని వ్రాసేడు. ఆ సాయంత్రమే శర్మ కుటుంబంతో సహా బయలుదేరి ఇంటికి జేరేడు.

ఇంటికిజేరినతర్వాత శర్మకు తన పూర్వపు జీవితం యథాతథంగా ప్రారంభమైంది. అంతకంతకూ దరఖాస్తులు చేయటంకూడా వ్యర్థమనిపించింది. చాలవుద్యోగాలకు దరఖాస్తులుచేయటం కూడా మానేశాడు. "వాంటెడ్ కాలమ్ను"ని కూడా చూడటం అసహ్యమనిపించింది. తాను మాత్రం ఇంటితో సంబంధము లేనట్టు ప్రవర్తిస్తున్నాడు. సాధ్యమైనంతవరకు ఇతరులతో సంబంధంలేకుండా తన గదిలో కూర్చుని యేవేవో పుస్తకాలు దొరికినంతవరకూ చదవటం యెవరేనా మాట్లాడితే ముక్తసరిగా సమాధానాలు చెప్పటం, తన్నుగురించి యెవరు యేమనుకున్నా విననట్టు వూరుకోవటం, ఈవిధంగా ఒక నెల్లాళ్ళు గడిపేడు. ఈ నెలరోజులలో యెడతెరిపి లేకుండా జేన్ ఆషిన్, తామస్ హార్డీ, పెరల్ బక్ వ్రాసిన నవలలు చదివేడు. తర్వాత బెర్నార్డుషా జాన్ గాల్స్వర్దీ డ్రామాలు తెచ్చుకొని చదవటం మొదలు పెట్టేడు. పుస్తకం తెరిచి వుంచినంతసేపు మనస్సుకు శాంతిగానే వుండేది. పుస్తకంమూయగానే మనసును పట్టుకోవటం అసాధ్యంగా వుండేది.

"ఈవిధంగా కూర్చునితింటుంటే యెంత కాలం వస్తుంది. ఏదో పైన కొంత సంపాదిస్తే వేన్నీళ్ళకు చన్నీళ్ళన్నట్టు నడిచిపోతుంది కాని" అనేమాటలు రోజూ అతని చెవిలో పడుతూనే వున్నాయి.

శర్మ నిర్లక్ష్యాన్ని తండ్రి గ్రహించేడు. అయితే యేమిచేయాలో ఆయనకు కూడా తెలియలేదు. ఇక ఏవేనా ఉద్యోగాల నిమిత్తమై చేయబడిన ప్రకటనలు కనబడితే ఆయనే స్వయంగా శర్మతో చెప్పి దరఖాస్తు చేయమనేవాడు.

శర్మ తండ్రి ఒకరోజున ఒక ప్రకటనను తీసికొనివచ్చి దానికి దరఖాస్తు చేయమని గట్టిగా శాసించి వెళ్ళేడు.

ఆ ప్రకటనను శర్మ జాగ్రత్తగా చదివి యే తేదీలోగా దరఖాస్తు చేయాలో, ఎంత ప్రవేశరుసుము చెల్లించాలో, జీతమెంతో, వ్రాయబడివున్నాయి. అన్నీ శర్మకు తృప్తికరంగానే వున్నాయి ఐతే ఆ ఉద్యోగానికి కావలసిన అర్హతలు చూడగానే మనసు వశం తప్పుతోందా అనిపించింది. ఒకకులమువారైతే బి.యే. మొదటి లేదా రెండవ తరగతులలో. ప్యాసై వుండాలనీ, ఇతర కులాలవారైతే, బి యే ప్యాసై వుంటే చాలనీ వెనుకబడిన వర్గాలవారికి మాత్రం ఇంటర్మీడియేట్ ప్యాసైవుంటే చాలునని వుంది. 'దరఖాస్తు చేయటమా మానటమా?' అని ఒకనిర్ణయానికి రాలేకపోయేడు. అతని మనసుకు ఒక వెఱ్ఱి ఆలోచన తట్టింది. వెంటనే ఆ ప్రకటనను పత్రికనుంచి జాగ్రత్తగా కత్తిరించి తీసేడు. దానికి క్రిందిభాగములో అదేసైజుగల చిన్నకాగితాన్ని అతికించేడు. దానిమీద చిన్నచిన్న అక్షరాలతో "ఇంకా వెనుకబడిన జాతివాడైతే స్కూల్ ఫైనల్ చాలుననీ, ఆటవికుడైతే ఎనిమిదవ తరగతివరకూ చదివివుంటే చాలునని బట్టలు ధరించటంకూడా తెలియని అనాగరికుడైన ఆదిమనివాసుడైతే చదువు రానివాడైనా దరఖాస్తు చేయవచ్చునని" వ్రాసేడు. ఆ ప్రకటనను జాగ్రత్తగా మడతపెట్టి ఒక కవరులోపెట్టి యేఅధికారివద్దనుంచి ఆ ప్రకటన వచ్చిందో అతని చిరునామాకి పంపించేడు. ఈపని పూర్తిచేసి మళ్ళీ తనగదిలోకి ప్రవేశించేడు. కాని అతని గుండె దుడుకుగావుంది. తను చేసినది చాల తెలివితక్కువ పనేమో అనుకున్నాడు. ఈ దేశంలో అనేకలోట్లు వుండవచ్చును ఈ దేశాన్ని మరమత్తు చేయటం తనవంటి అమాయకుని పనేనా? గుండెదడ యెక్కువైంది. తను చేసినపనికి యెంతో

# ★ ఉద్యోగాలు ★

విచారపడ్డాడు. ఆ విధంగా వ్రాసిపంపించే ధైర్యం తనకు యెక్కడనుంచి వచ్చిందీ? తనువ్రాసిన పిచ్చివ్రాతను ఆ అధికారి చూస్తాడా? ఈలోగానే యెవరో ఒకరు దానిని చింపి అవతల పారవేస్తారు. నిజంగా తను ఒక అమాయకుడే. అందువల్లనే అతనికే వుద్యోగం దొరకలేదు. ఆరోజున యిక పుస్తకంకూడా చదవలేకపోయేడు. కాలం యేవిధంగా వెడుతోందో తనూ ఆవిధంగానే వెళ్లాలి. ప్రవాహానికి యెదురుగా వెడితే నష్టపోయేది తనేకాని ప్రవాహంమాత్రం కాదు.

ఆ సాయింత్రం తండ్రి శర్మ గదిలోకి వచ్చి "దరఖాస్తు పంపించేవా?" అన్నాడు.

"లేదు."

"యేమి?"

"నేను ఆ వుద్యోగానికి కావలసినంతగా వెనకబడిలేను" అన్నాడు శర్మ.

తండ్రికి విపరీతమైన కోపం వచ్చింది.

"కావలసినదానికంటె యెక్కువగా చదివించటం నాదే తప్పు. చిన్న ఉద్యోగాలు నీకు పనికిరావు; పెద్దవి రావు. ఈ విధంగా నువ్వు బాధపడవలసిందే."

ఎల్లాగైనా శర్మచేత దరఖాస్తు చేయించాలన్న ఉద్దేశ్యంతో వున్నాడాయన. శర్మ చేసిన తెలివితక్కువపని ఆయనకు తెలియదు. కాసేపాగి "అయితే యేమి చేయదల్చుకున్నావు?" అన్నాడు.

"ఏమీ లేకపోతే వ్యవసాయం చేయదల్చుకున్నాను."

శర్మ ఇటువంటి సమాధానం చెబుతాడనుకోలేదు తండ్రి.

"నువ్వు వ్యవసాయానికి పనికిరావని నా కేనాడో తెలుసు. నువ్వు వ్యవసాయం చేస్తే గింజ పండదు. పండినా యింటికి రాదు."

"అయితే ఈ సంవత్సరం ఇల్లాగేవుండి వచ్చేయేడు 'లా' చదువుతాను."

"నీ చదువుమీద ఇంతవరకూ చేసిన దండగ చాలు" అన్నాడు తండ్రి.

"ఏమైనాసరే ఈ వుద్యోగానికి దరఖాస్తు చేయకపోవటం మాత్రం ఖాయం" అన్నాడు శర్మ. తండ్రి కోపంగా వెళ్ళిపోయేడు.

కృష్ణారావు కాంపునుండి తిరిగి రాగానే జరిగిన విషయం అంతా చెప్పేడు. సెప్టెంబరునకు బదులుగా ప్రకటనకాగితాన్నే కొద్దిపాటి సవరణలతో వెనుకకు తిరిగి పంపించేనని చెప్పి తన గుండెల్లో వున్న బరువంతా వదుల్చుకున్నాడు.

"భేష్! చాలా మంచిపని చేసేవు. నీలో పైకివచ్చే సూచనలు యిప్పుడిప్పుడే కనబడుతున్నాయి. ఈమాత్రం గుండె నిబ్బరం ఇదివరకే వుంటే చాలా బాగుపడేవాడివి. ఇటువంటి పనులు నేను రోజుకి అరడజను తక్కువ కాకుండా చేస్తుంటాను." అన్నాడు కృష్ణారావు

ఇంతలోకే రాఘవరావు సైకిల్ మీద అతి అట్టహాసంగా వచ్చేడు. శర్మ దగ్గర అంత సంతోషాన్ని ప్రదర్శించటం ఇదే మొదటిసారి. యేదో పెద్ద విశేషం వుందనుకున్నారు.

సాధారణ మర్యాద వాచకాలైన గుడ్ మార్నింగులైన తర్వాత

"పబ్లిక్ సర్వీసు కమీషన్ పరీక్షాఫలితాలు వచ్చేయి" అన్నాడు రాఘవరావు.

"మీ ఇంటిదగ్గరకు వెళ్ళివస్తున్నాను. నరసారాయణులిద్దరూ ఒకేచోట వుంటారని తెలిసి ఇక్కడకు వచ్చే" నన్నాడు మళ్ళీ.

"మమ్మల్ని చంపక అసలు సంగతేదో చెపుదూ?" అన్నాడు కృష్ణారావు. "ఆ యేముందిలే; మీ దయవల్ల పబ్లిక్ సర్వీసు కమీషనులో ప్యాసయ్యేను. '......' తాలూకా ఆఫీసులో క్లర్కుగా వేసేరు" అన్నాడు నెమ్మదిగా. లోపల్నుంచి సంతోషం పైకి తన్నుకొని వస్తోంది. శర్మ తనకంటె యెక్కువ చదువుకున్నాడు. చదువు ముందు పూర్తిచేసేడు. అయితే ఉద్యోగం మాత్రం సంపాదించుకోలేకపోయేడు. ఈ రోజున శర్మమీద నిజమైన విజయాన్ని సంపాదించేననుకున్నాడు.

శర్మ పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షలకు కట్టలేదు. అప్పటి కింకా తన కేదో పెద్ద వుద్యోగం వస్తుందనే ఆశతో వున్నాడు. ఇప్పుడా ఆశలు తీరిపోయేయి. పబ్లిక్ సర్వీసు పరీక్షలకు కట్టకపోవటం తప్పుకుండా పొరపాటే అనుకున్నాడు. తండ్రి తనను నిందించటములో అర్థంలేకపోలేదు.

"నీ జీవితంలో అతి ముఖ్యమైన సమస్య ఒకటి పరిష్కారమైందన్నమాట—" అన్నాడు శర్మ.

"అయితే నిన్ను మన జిల్లాలో వేయక ఇంకో జిల్లాలో వేసేరేమిరా?" అన్నాడు కృష్ణారావు.

"నేనే ఆ జిల్లాని కోరేనోయి. మన జిల్లాలో ప్రమోషన్లు త్వరగా రావు" అన్నాడు రాఘవరావు.

రాఘవరావు సంతోషం పట్టలేకుండా వున్నాడు. చదువు పూర్తికావటం ఆలస్యమైనప్పటికీ వుద్యోగం సంపాదించటంలో విజయం తనదే అనుకున్నాడు. ఒక వేళ శర్మ మళ్ళీసారి పబ్లిక్ సర్వీసు పరీక్షలకు వెళ్ళినప్పటికి తన కతనిపై సీనియారిటీ వుంటుంది. ఈలోగా తను యే డిప్యూటీ తాసిల్దారో అయ్యే సావకాశం వుంది. శర్మ తనదగ్గర గుమాస్తాగా వుండవలసిందే. అనేక విధాలుగా వూహించుకున్నాడు రాఘవరావు. చివరకు ఉండబట్టలేక,

"ఎగిరెగిరివెళ్లే కుందేటికంటె తాపీగా వెళ్లే తాబేటిదే విజయం" అన్నాడు.

"నిజమేరా బ్రదర్! నువ్వు చాలా అదృష్టవంతుడివి" అన్నాడు శర్మ.

కృష్ణారావుకి మాత్రం రాఘవరావు మాటలు ఏమాత్రం నచ్చలేదు. "శర్మకీ రాఘవరావుకీ పోలికెక్కడ? చిన్న గుమాస్తాగిరీ రాగానే యింద్రుడి సింహాసనం సంపాదించినట్టు సంతోషిస్తున్నాడు." అనుకున్నాడు పైకిమాత్రం.

"నీ ఉపమానం ఇక్కడ యెంతమాత్రం సబబుగా లేదు. కేవలం ఉద్యోగం సంపాదించటమే జీవితంయొక్క ఏకైక లక్ష్యం అనుకుంటే విజయం పూర్తిగా నాది. మూడేళ్ళనుంచి నెలకు మూడువందలు చొప్పున తెచ్చుకుంటున్నాను కానీ నే నెప్పుడూ నీలాగ అనుకోలేదు. చదువుకున్నవాడి విలువ వేరు" అన్నాడు కృష్ణారావు.

"ఏదో సరదాగాఅన్నాను. సీరియస్‌గా తీసుకోవద్దు" అన్నాడు రాఘవరావు.

"నేనూ అంతే" అన్నాడు కృష్ణారావు.

శర్మకి ఈవిధమైన ప్రసంగం యెంతమాత్రం యిష్టంలేదు. ఎవరిఅదృష్టం వారిది. నిజంగా రాఘవరావు యెన్నోవిధాలుగా తనకంటే అదృష్టవంతుడు. దానిని కాదనటానికి వీల్లేదు అనుకున్నాడు.

తర్వాత ప్రసంగం కొంత సరదాగానే నడిచింది. రాఘవరావుమాత్రం తన ఉద్యోగాన్ని వూహించుకుంటూ తన భావిజీవితంలో చేయదల్చుకున్న పనుల్ని గురించి యేవేవో చెబుతున్నాడు.

"వెఱ్ఱివాడు. వుద్యోగమంటే యేమిటో అనుకుంటున్నాడు" అనుకున్నాడు కృష్ణా

రావు. తర్వాత ముగ్గురు మిత్రులు ఆపూటకు విడిపోయేరు.

రాఘవరావు ఉద్యోగం వార్త ఒక గంటలో ఆ వూరంతా పాకిపోయింది. రాఘవరావు తండ్రి శర్మయింటికి యేదోపని కల్పించుకొని డజనుసార్లు వచ్చేడు. వచ్చినప్పుడల్లా ఒక అరగంటసేపు రాఘవరావు భవిష్యత్తుని గురించి అతని తెలివితేటలు గురించి ఉపన్యాసంచేసి నెడుతున్నాడు. ఆరోజంతా ఆయన వీధిలో నేతప్ప యింట్లో లేడు. ఎవరికైనా ఉద్యోగం రాకపోతే అది వారిలోటే కాని మరేమీ లేదన్నాడు.

రాఘరావు విషయం అసలు చెప్పక్కర్లేదు. శర్మకి పుస్తకాలు రుబ్బటం మాత్రమే చేతనౌనుకాని లోకజ్ఞానం యేమాత్రం లేదనీ, అందుచేత అతనికి యేవుద్యోగంచేసే అర్హతా లేదనీ, అంతేకాని ఈభారతదేశంలో ఉద్యోగాల కేంతమాత్రం కొరతలేదని కూడా చెప్పటం మొదలుపెట్టేడు.

ఇక రాఘవరావు భార్య గిరిజకు ఆరోజు స్వర్గంలో తిరుగుతున్నట్లుంది. ఏదోవిధంగా తెగిపిచేసుకొని రాజ్యానికి ఈ వార్త స్వయంగా చెబితేకాని ఆమెకు తృప్తిగా లేదు. రాజ్యానికి ఈవార్త తెలియదని కాదు. యేదో ఒక మిషమీదవెళ్ళి ఆమెకు తనే స్వయంగా చెప్పాలి. ఆవయాన్ని ఆమె యేవిధంగా గ్రహిస్తుందో తెలుసుకోవాలి. ఇక రాఘవరావు తల్లిసంగతి వేరే చెప్పక్కర్లేదు.

మొత్తంమీద ఆ యింటిలోవారందరికీ ఉద్యోగం సంపాదించిన రాఘవరావు ఇండియా సామ్రాజ్యాన్ని సంపాదించిన రాబర్ట్ క్లైవులాగ కనపడ్డాడు. వారోక డిన్నర్ పార్టీ యేర్పాటుచేయాలని నిశ్చయించు కున్నారు. ఆ సందర్భంలోనే రాఘవరావు తమ్ముడు లక్ష్మణరావు ఉపనయనంకూడా జతపరచి పెద్దయెత్తున ప్రయత్నాలు చేసేరు.

రాజ్యంమాత్రం ఆరోజున మనసులో యెంతో నొచ్చుకొంది తన భర్తకంటె తక్కువ చదివినవారికికూడా ఉద్యోగాలు వస్తున్నాయి. శర్మకు ఉద్యోగం రాకపోవటం గ్రహచారమేకాని మరేమీ కాదనుకుంది.

శర్మయింటికిరాగానే రాజ్యం "కరణం గారి అబ్బాయి రాఘవరావుకి ఉద్యోగం వచ్చిందిట" అంది.

"సంతోషం"అన్నాడుశర్మ. ఇక మిగతా వారెవరూమాట్లాడలేకపోయేరు. శర్మతండ్రి మాత్రం "వీడికి రాఘవరావుకి పోలికెక్కడ? వాడికున్న లోకజ్ఞానంలో పదవవంతు కూడా లేదు మనవాడికి" అన్నాడు. శర్మ తల్లికిమాత్రం ఈమాటలు నచ్చలేదు. "పోనీ లెద్దురూ. ఇంతోటి గుమాస్తాగిరి రాకపోతే పోయింది. మనవాడిది పెద్ద చదువు. చదువుకున్నది యెప్పుడూ వ్యర్థంకాదు. ఎప్పుడో ఒకప్పుడు పెద్ద వుద్యోగం వచ్చి తీరుతుంది." అంది. పైకి ఈమాట అంది కాని లోపల ఆమెకు బాధగానేవుంది. ఆ యింట్లో అసలు యే బాధా లేకుండా వున్నటు కనిపించింది ఒక శర్మ మాత్రమే.

# ★ ఉద్యోగాలు ★

కరణంగారి యింటో డిన్నర్‌పార్టీకి ఆహ్వానాలు వచ్చేయి. మొదట కృష్ణారావు డిన్నరుకు రానన్నాడు. వెళ్ళకపోతే బాగుండదన్నాడు శర్మ. మొత్తంమీద వారు వారి కుటుంబాలతో సహా డిన్నర్ పార్టీకి హాజరయ్యేరు. రాఘవరావు చాల ఉత్సాహంగాను, చురుకుగాను తిరుగుతున్నాడు. ఏమూల చూసినా అతనే కనబడుతున్నాడు కృష్ణారావు శర్మలదగ్గరకువచ్చి "మొహమాటం పడకుండా కావలసినవన్నీ అడిగి వేయించుకోండి" అని పదేపదే హెచ్చరించి వెడుతున్నాడు. ఇక పెద్దవాళ్ల పంక్తిలో కూర్చున్న రాఘవరావు తండ్రి కరణంగారు రెవెన్యూ డిపార్టుమెంట్ ఉద్యోగమంటే యేమిటో, దానికి యెంత హోదా వుంటుందో సవివరంగా చెపుతున్నాడు. తమవాడు గుమాస్తాగా ప్రవేశించినప్పటికే బి. యే ప్యాసై వుండటంవల్ల ప్రమోషన్లు బహు తేలికగా వస్తాయన్నాడు. "ఒక్క ఐదేళ్లు ఓపిక పట్టేమంటే తాసిల్దారై కూర్చోవచ్చు" అన్నాడు అందులో రాఘవరావులాంటి చురుకైనవాడికి ప్రమోషన్లు మరీ తేలిక. రాఘవరావు సంపాదించినది గుమాస్తాగిరి అయినప్పటికీ వారి ఊహల్లో అప్పుడే డిప్యూటీ కలకర్రై కూర్చున్నాడు. డిపార్టుమెంట్ పరీక్షలు ప్యాసవటం మాత్రమే ఇక ఆలస్యం. కరణంగారు "ఫలానావారు గుమాస్తాలో ప్రవేశించి పదేళ్లలో డిప్యూటీ కలక్టరైయ్యేరు. ఇంకొకరు పన్నెండేళ్ళు పూర్తికాకుండానే జిల్లాకలక్టరయ్యేరు" అని యెంతమంది గుమాస్తాలు కలక్టరైందీ సంఖ్యాపూర్వకంగా ఉదాహరణలతోటి ఋజువు చేస్తున్నాడు. వచ్చిన అతిథులందరూ కూడా, రాఘవరావు డిప్యూటీ కలక్టరవటానికి ఆట్టే ఆలస్యం లేదు" అన్న ప్రతిపాదనను ఏకగ్రీవంగా సమ్మతించినట్టే కనపడ్డారు.

జీవితంలో ఆరితేరినకృష్ణారావు ఇదంతా ఒక వినోదంక్రిందా, శర్మ "ఈవిధంగా అనుకోవటం సహజమే" అన్నట్టుగా భావించేరు.

ఆడవారి పంక్తిలో గిరిజా, గిరిజ అత్తగారూ, చేసే కోలాహలానికి హద్దులేకుండా వుంది. "డిగ్రీలు వుండగానే సరా యేమిటి, వుద్యోగం లేకపోయిం తర్వాత" అన్న మాటలు రాజ్యానికి తరుచు వినిపించేయి. ఆ మాటలు విన్నప్పుడల్లా మనసు చివుక్కుమంటోంది "తనకంటే ఎక్కువ చదివినవారికికూడా ఉద్యోగాలు రాని సమయంలో రాఘవరావు ఉద్యోగం సంపాదించేడంటే అతనిలో వున్న ప్రతిభ కాకపోతే మరేమిటి?" అక్కడకు చేరిన వారందరి అభిప్రాయమూ అట్లాగే వుంది. "పాపం! మీవారికింకా వుద్యోగం రాలేదూ?" "తెలివైనవాడే! ఉద్యోగం యెందుకు రాలేదో?" అనే వూరడింపు మాటలు కూడా వినపడ్డాయి. ఈ ఊరడింపులు రాజ్యం, రాజ్యం అత్తగారి బాధ యెక్కువ చేయటానికిమాత్రమే ఉపయోగపడ్డాయి. అక్కడ వున్నంతసేపు వారికి ముళ్లమీద కూర్చున్నట్టు వుంది.

మర్నాడుదయం కొంపుకి వెడుతూ కృష్ణారావు శర్మ యింటికి వచ్చేడు. శర్మ తండ్రికి కృష్ణారావు సావాసం యెంతమాత్రం యిష్టంలేదు. శర్మ లోపాలన్నిటికీ కృష్ణారావే కారణం అని ఆయన నమ్మకం. అయితే కృష్ణారావు ఉన్నంతసేపు శర్మ ఈ మానవ ప్రపంచంలో వున్నట్టు కనబడతాడు. అందుచేత కృష్ణారావును చూసి లోపల గొణుక్కోవటమే కాని పైకి ఏమీ అనేవాడుకాదు. ఆరోజున "మీ కంపెనీలో యేదేనా వుద్యోగంవుంటే మావాడికి యిప్పించవోయి!" అన్నాడు.

"ఇటువంటి కంపెనీ వుద్యోగాలు శర్మలాంటివాడికి కావు. చదువూ సంధ్యా లేని నాబోటివాడికి మాత్రమే"అన్నాడు కృష్ణారావు.

"అచ్చంగా మావాడి అభిప్రాయమూ అంతే. అందుచేతనే ఏ వుద్యోగంలేకుండా పోయింది." అని వెళ్ళిపోయేడు. కృష్ణారావు మాట్లాడలేదు. తర్వాత శర్మ లోపలి నుంచి వచ్చేడు. మాటల సందర్భంలో కృష్ణారావు "నిన్న రాఘవరావు వరస చూస్తే నీకు రైలులో తటస్థపడ్డ అవారాకి వీడికీ అట్టే తేడా లేదనిపిస్తోంది. ఏదేనా తేడా వుంటే అది అంకాలలో మాత్రమే" అన్నాడు. తర్వాత అక్కడనుంచే బస్సెక్కి వెళ్ళిపోయేడు. రాఘవరావు కూడా వెళ్ళి తన పనిలో జేరేడు.

తర్వాత ఒకరోజున రంగారావు దగ్గర నుంచి ఉత్తరం వచ్చింది హోటలు తిండితో ఆరోగ్యం పాడవుతోందనీ, అందుచేత విశాలాక్షిని తీసుకొని వెళ్ళదలచినట్లూ, అందుకు సిద్ధంగా వుంచవలసిందనీ వ్రాసేడు. ఆ వుత్తరంలోనే తనతో బి. యే ప్యాసైన స్నేహితుడొకడు.. కాలేజీలో ట్యూటరుగా పనిచేస్తున్నాడని అతడు కారణాంతరాలచేత నాలుగు నెలలదాకా శలవు పెడుతున్నాడనీ శర్మ దరఖాస్తు పెడితే తాత్కాలికంగా ఆ వుద్యోగం దొరకవచ్చనీ కూడా వ్రాసేడు ఆరోజే శర్మ దరఖాస్తు పంపించేడు

నాలుగోరోజున రంగారావు వచ్చేడు. విశాలాక్షి ఆ రోజు కారోజే తొందర పడుతోంది వెళ్ళిపోవటానికి. మర్నాడే రంగారావు విశాలాక్షి పిలలు వెళ్ళిపోయేరు. వాళ్ళు వెళ్ళగానే సందడి పూర్తిగా తగ్గి యిల్లంతా చిన్నపోయింది ఇక ఆవూళ్ళో వుండటం అసాధ్యమనుకున్నాడు శర్మ.

అదృష్టవశాత్తు రెండురోజులలో శర్మని కాలేజీలో ట్యూటరుగా నియమించినట్లు ఒక వారంరోజులలో పనిలో జేరాలని కాలేజీనుంచి వుత్తరువు వచ్చింది. దీనితో శర్మకి ఉద్యోగపు సమస్య తాత్కాలికంగా తీరింది ఆ కాలేజీవున్న వూళ్లోనే రాఘవరావు తాలూకా ఆఫీసులో పనిచేస్తున్నాడు. రాఘవరావుకు వెంటనే ఒక ఉత్తరం వ్రాసేడు. ఆ వూళ్ళోవున్న కాలేజీలో ట్యూటరుగా వుద్యోగం వచ్చిందనీ, ఆ వూరు తనకు క్రొత్తకాబట్టి మొదటి రోజుల్లో తనకు ఆతిథ్య మీయవలసిందనీ వ్రాసేడు. కాని రాఘవరావుదగ్గర నుంచి యేవిధమైన సమాధానమూ రాలేదు. కృష్ణారావు పినతండ్రి కొడుకొకడు ఆ కాలేజీలోనే చదువుతున్నట్టు అతను కాలేజీ హాస్టలులో వుంటున్నటు శర్మకు తెలుసు. అతని రూంలో బసచేయవచ్చును కున్నాడు శర్మ. ఒక మంచిరోజు సుముహూర్తంలో బయలుదేరి వెళ్లేడు శర్మ.

[ఇంకావుంది]

# ఏది స్వర్గం? ఏది నరకం?

అంధకారం నలుదెసలా క్రమ్ముకొంటున్నది. బుడ్డిదీపాలవెలుగులో కొన్న పచారీసరుకుల మూటల్ని సింధీ దుకాణాలనుంచి మోసుకొస్తున్న సుబ్బయ్యకు అరికాళ్ళలో గ్రుచ్చుకుంటున్న గతుకులరోడ్డుమీది ములుకుల్లాంటిరాళ్ళు, బుర్రలో ఆలోచనలరాపిడికన్నా అధికంకాగా, సంచీ నొకమాటు దింపి బీడీని నోట్లోకి దూరుకొని, మొహంచి - అగ్గిపుల్ల గీశాడు. బుస్సుమని మండి టప్పుమని చలిగాలి విసురుకు ఆరిచక్కాపోయింది చలికి గుండెలు గజగజలాడాయి. చెవులు శీతగాలి పోసుకుని ఆరుబయట నడివీధిలో నిలవటం కష్టమనిపించినప్పుడు సుబ్బయ్య తన్ను గూర్చి దీనంగా వూహించుకోబోయి కృతకృత్యుడు కాలేక - 'అప్పుజేసైనా యీమారు వూలు మప్లరు - ఫుల్ స్వెట్టరు కొనుక్కుంటాను' అని తనలో తాను గొణుక్కున్నాడు. వెంటనే దుస్వప్నంలా దండాన వ్రేలాడేసి వుంచే తోలులా మాసినచొక్కాలు మన్ను గొటిన పంచెలూ - అలుగుడ్డలాంటి చీరతో - రేగిన జుత్తు, పెంకులాంటి నల్లటి ముఖం, తెల్లగా మెరిసే రెండు పొరపళ్ళతో - వూరంత గొంతుక చేసుకుని పిల్లల వీపుల మీద పిడకలు చరిచే భార్య, వాళ్ళ అనైక్య అసంబద్ధ రోదనధ్వనులూ స్మృతికి రావటంతో సుబ్బయ్య ఆకారాన్ని మార్చుకోసాగాడు. ఆఫీసులో సుబ్బయ్య నెమ్మదస్తుడు. పాపం అమాయకుడు వొకరి జోలికేపోడు. భార్యముందు ఆకారం రంగు ఫిరాయించుకుంటుంది. లొంగని పరిస్థితులు తిరగబడి ప్రశ్నించే కాలం, అసమర్థత - ఆదాయంతో సంబంధం లేని వ్యయం, అడక్కుండా పుట్టుగొచ్చే పిల్లలూ సుబ్బయ్యను మార్చేశాయి. ఇది తెమ్మన్నప్పుడు గాని, యివాళ యీఖర్చు పెట్టాలని గాని భార్య తన నోటసుకు తెచ్చేముందు ఉభయులూ కొట్లాడుకోవటానికి సంసిద్ధులయే వుండాలి. సుబ్బయ్య ముంగు వింటాడు. ముఖం మాడ్చుకుని తన అసమర్థతను ప్రకటిస్తాడు. యావత్తు అప్పుల జాబితాను వప్పజెప్పి తరవాయి ఆత్మహత్యగా సూచిస్తాడు. ఆ మహాయిల్లాలు పసుపుకొమ్ము గట్టితనం 'మ్రింగుమనె సర్వమంగళ, మంగసూత్రమ్ము నెంతమంది నమ్మినదో' అన్నట్లు యేమైనా తప్పదనే భావన వెలిబుచ్చటమూ సుబ్బయ్య వుత్తరీయం ఝాడించి జంధ్యం త్రెంపుగునేవరకూ అర్ధాంగి వంశక్రమాన్ననుసరించి తిడ్తూ బజారుకు వెళ్ళి కిక్కురుమనకుండా ఆయా సామాగ్రి తెచ్చి పడెయ్యటం మామూలు. ఈ నరకంలాటి సంసారకూపంలో సుబ్బయ్యకు అర్ధాంగి ముఖం సింహస్వప్నమైనపుడు, ఆఫీసులో పది గంటలనుంచి ఐదు ఆరువరకూ గడిపేకాలం సారాయికన్నా మత్తు కలిగించేదిగా - ఆ ఆఫీసులో నిత్యమూ ఖర్చుగా దొరికే చివాట్లూ, నక్కవినయాలు, దొంగదండాలు యీ నరకసదృశమైన యింట్లో జీవితాన్నుంచి ఆ ప్రాణిని యేడామడల దూరం తీసుకెళ్ళి విడచిపెట్టగా మళ్ళీ యింటిగుమ్మం త్రొక్కటానికి సుబ్బయ్యమనస్సు బడి పిల్లవాడిలా పేచీలు పెట్టేది.

[illegible] శర్మ

పిల్లలకు యింట్లో సుబ్బయ్యభార్య తండ్రియొక్క అసమర్థతను వేయివిధాలుగా నూరిపోసేది. సుబ్బయ్య చేతగాక కాళ్ళు సాచి నోరువెళ్ళబెట్టినప్పుడు తను యెన్ని విధాలుగా తెలివితేటల్ని ప్రదర్శించి సరుకులకి సరుకులూ డబ్బుకు డబ్బు పుట్టించుగొచ్చినదీ, చిలవలూ పలవలూ జేసి చెప్పుకొచ్చేది. పిల్లలకు రోగాలువచ్చినప్పుడు తను యేవిధంగా గుండె ధైర్యం ప్రదర్శించినదీ, సుబ్బయ్య నీళ్ళు కారుతూ గుడ్లప్పజెప్పినప్పుడు ఆడపనీ మగపనీ తానే ధైర్యంగా ముందుకొచ్చి చక్రం త్రిప్పి యెట్లా అడ్డువేసినదీ కూతుళ్ళకు వర్ణించి చెప్పేది.

గతంలోకి తిరిగి చూసుకున్నప్పుడు తాము సాధించిన విజయాలేమీ గోచరం గాకపోగా సుబ్బయ్య - అతడి భార్యా ఉభయులూ తమజీవితాల్లోని 'అసంతృప్తి'కి వొకరొకరు బాధ్యులు గాయెంచుకుంటూ - 'యిది తమతో గాని అంతంకాదనీ వచ్చే జన్మకైనా యింతకలగాలని' సృష్టికర్తను అమాయకంగా వేడుకొంటూంటారు రోజులు గడుస్తున్నకొద్దీ సుబ్బయ్యభార్య - తనబిడ్డలు తండ్రివలె అసమర్థులూ - దురదృష్టహీనులూ గాకుండా - ప్రయోజకులూ జీవితంలో సుఖపడేవాళ్ళు కావాలని నిత్యమూ తపించిపోయేది.

సుబ్బయ్య మెదడు 'అకస్మాత్తుగా వరించి వచ్చే అదృష్టం'కోసం కాసుకుని కాసుకుని 'సుఖపడే తీయటి కలల్నూ - గాలిలో మేడల్నూ' కట్టుకుంటూ నిరాశ నిస్పృహ అన్నది దరిజేరనీయకుండా - 'యిదిగో యివ్వాళ కాకపోయినా రేపన్నా కలిసి వస్తుంది' అన్న ఆశమీద బ్రహ్మాండమైన పందిరి వేసుకు కూర్చున్నది

సుబ్బయ్య భార్యకు మరోధీమా -

ఇటీవల ఆమెను యేమీ పల్లెత్తుమాట అనటానికి వీలులేకుండా వచ్చిపడింది సుబ్బయ్యకు అవస్థ. ఒకప్పుడు యీ మనిషికి యేదన్నా రోగంవచ్చి హఠాత్తుగా చచ్చిపోకూడదా - తల్లిలేని పిల్లలని తలొకరూ తెచ్చి పెంచుకుంటారు - యీ ఝంఝాటం ఎలా వచ్చినది అలా తెగిపోతుంది, తనేమో కాస్త విచారం పోయేటందుకు గీతా పారాయణా అదీ మొదలుపెట్టవచ్చుఅని వూహించాడు. అప్పుడే తనభార్య గతించినట్లు - తను పిల్లల్ని అదిగో అమ్మ అని ఆకాశంకేసి చూపించి మరిపించటం కొంతకాలానికి పొరబాటున యెవరైనా మళ్ళీ పెళ్ళి ప్రసంగం యెత్తకుండా గడ్డంకూడా పెంచినట్లయితే ఆఫీసులోకూడా 'అయ్యోపాపంసుబ్బయ్యకు ఎంతవైరాగ్యం?' అని నలుగురూ అదోలా చూడ్డం - అప్పులవాళ్ళకేసి తనుచూసి చిరునవ్వు నవ్వినపుడు 'అయ్యో! పంతులుగారూ మీ సొమ్ము ఎక్కడకు పోతుందండీ -' అని విషపునవ్వులు నవ్వటం వాళ్ళు అన్నీ వూహించుకొనే లోపునే 'భోజనానికి లేస్తారా?' అని ఆ పొరపళ్ళు, తగూలాడ్డమే వారి దాంపత్యానికి సహజధర్మమైనట్లు మాడ్చుగున్న ముఖంతో ఆ యింటావిడ కనపడ్డంతోనే - 'యేమిపాపపుటాలోచన' అనిపించి మనస్సు కాస్త నొచ్చుగునేది భోజనానికి కూర్చున్నప్పుడు.

నిజంగా సుబ్బయ్యకు అహెపా తహెపా ఆమాత్రం మనస్సు నొచ్చుగోకపోతే అది చాలా శుష్కమూ శూన్యమూ ఆనంద రహితమైన దాంపత్యమనే చెప్పాలి.

విధివశాత్తూ సుబ్బయ్య మావగారు యేకళనున్నాడో పెద్దమనుమరాలికి తన చేతుల మీద ముడిపెడ్తానన్నాడు. సుబ్బయ్యభార్య దిక్కుమాలి లోభిముండావాడని ఆడిపోసుకున్న సంగతే మర్చిపోయి తండ్రికి చేతిలో యెముక తక్కువన్నంతవరకూ పొగిడి ఆ కార్యం కాస్తా అయిందనిపించుకుంది.

# ★ ఏది స్వర్గం? ఏది నరకం? ★

వెయ్యిన్నూటపదహార్లిచ్చి అమ్మడుకు పెళ్ళిచేశారు. పైన ఖర్చంతాకూడా ముసలాయన జోక్కసంలోంచే తీసి యిచ్చాడు. సుబ్బయ్యపనల్లా దర్జాగాపీటలమీద కూర్చోవటమే. ఆరోజు ఆ పారపళ్లావిడముఖంలోని గొప్పను సుబ్బయ్యామూనీ యీర్ష్య చెందకపోలేదు. ముసలాయన కింత వుదారత యెక్కడ్నుంచి వూడిపడిందా అంటే - దాన్లో చిన్న కిటుకు యిమిడి వుంది. దాన్నే నమ్మేవారైతే అమ్మడి అదృష్టం అని సరిపుచ్చుతారు. వెనకటికి ముసలాయనకు గొప్ప జబ్బు చేస్తే - అప్పటికి సుబ్బయ్యభార్య చూలాలు. ఖరవాలేదయ్యా మనుమడో మనుమరాలో పుట్టేదాకా బ్రతుకుతావు.' అన్నారు లోకులు. అమ్మడు పుట్టింది. ముసలాయన తన ప్రాణాల్ని పుచ్చుగోకుండా వదిలినందుకు మనుమరాలికి పెళ్ళి జరిపిస్తానన్నారు. అప్పుడే అన్నాడు సుబ్బయ్య తాపీగా 'ఆడినమాటను దప్పిన...' అంటూ, ఆ కాస్త విశ్వాసం కనబర్చారు పెద్దలైవున్నందుకు.

సుబ్బయ్య అంటాడు—'చచ్చేవాడికి ప్రాణం పోసింది - ఆయనేం పూరికే యిచ్చేడా....' అని.

సుబ్బయ్య భార్య 'పోస్ పొమ్మంటే - మీరేంచేద్దురు? కూర్చున్నచోటునుంచి లేవలేని రకం...అయ్యో నా తెలివి? ఆమాత్రం సందర్భంకూడానా...' అని నాలుక జార్చేది.

ఈ తగవులు యీలా వుంటూండగానే సంవత్సరం దొర్లింది. అమ్మడు పైటలు మార్చింది. చింతపువ్వూ పూసింది.

కాలమూ మనుష్యుల్లో వచ్చే మార్పును గుర్తించే జ్ఞానం సుబ్బయ్యకు పోయింది. ముసలాయన తూర్పారబడ్తూ - అవతలవాళ్లు వొక్కమూరైనా పిల్లడ్ని పండగలకు తీసుకెళ్లలేదని అనుకుంటున్నారనీ - వ్రాశాడు. సుబ్బయ్య భార్య తైమని ఆడింది. ఇద్దరూ కొట్లాడుకున్నాక - సుబ్బయ్య వోడిపోయాడు. అమ్మడు కిటికీదగ్గర కూర్చుని మోకాళ్ళమీద తల ఆన్చి వెక్కి వెక్కి యేడుస్తున్నది. 'నేను చచ్చిపోయానా అమ్మా—' అంటూ సుబ్బయ్యభార్య దీర్ఘాలు పెట్టింది. పెద్దూసే ఏనూళ్లకు ముద్దూముచ్చటా నూ - నీ ఖర్మం నా ఖర్మం - అని భర్త ముఖంకేసి ఒకమాటు చేతుల్ని త్రిప్పింది.

సుబ్బయ్య నిర్విణ్ణుడయాడు. అమ్మడుని బ్రతిమాలుకున్నాడు - 'మీ ఆయనకు రిస్టువాచీ - నీకు మంచి చీర' కొనిపెడ్తానుగా అని.

ఇంతలో సంక్రాంతి వచ్చింది.

సుబ్బయ్య సరుకుల్ని మోసుగొస్తున్నాడు, వెధవ బీడీ యిట్టే వెలిగి యిట్టే ఆరిపోతుంది. అగ్గిపుల్లలు దండగ. దారిన మొలిచినట్లున్న సూదుల్లాటి రాళ్లు నడవనిచ్చేట్లు లేవు. ఇంట్లో పెళ్ళాం బ్రతకనిచ్చేట్టులేదు, చేరవలసినవి చేరవెయ్యకపోతే....

'హరి భగవాన్! ఈ డిస్పెన్సరు గిరీ యివ్వకపోతే మరో సుఖపడే డబ్బుగల వుద్యోగం ..'

భగవంతుడు, నీలాటి దరిద్రులు లక్షలూ కోట్లసంఖ్యమీద అని చిరునవ్వు నవ్వుతాడు.

'పోనీ లాటరీ - ఫజిల్సు - *D21-C* 19 ...సుగ్రప్పందేలు...' ఆఖరికి యే సినీమాలో నన్నా దూరితే-అదృష్టం బావుండి గొప్ప హాస్యనటుడైతే...' అప్పుడుకూడా ఫలానా సుబ్బయ్య భార్య యెంత అదృష్టవంతురాలు! అంటారు. ఛా - దానిముఖమే ...పిల్లలు...పిల్లలు...వాళ్లైన్నా గొప్పవాళ్లు కావాలి. యేముందీ? చేతులో యేదో యెవరికీ వుండనిచోట వొక బ్రహ్మాండమైన రేఖవుంటే...బస్...యిక వాళ్ల అదృష్టం, యేమన్నా కావచ్చు.

సుబ్బయ్య చేపలా గాలితిని జీవిస్తాడు.

ఇంటిదగ్గర భార్య రొల్లానూ వేధించుకు తింటుంది, తెల్లారితే పండుగ - అల్లుడుగాడు తిన్నగా వచ్చి యేడవకూడదూ. ఈ చలిలో ప్రతిబండికీ కుద్రవెధవను త్రిప్పినట్లు తిరగమంటుంది. కాకికేం తెలుసు సైకో అనాలిసిస్. రాత్రి పన్రెండు గంటలకు ఎముకలు కొరికేచలి. వెధవ బీడీ ఆరిపోతూంటే...యీ సూదుల్లాటి రాళ్ళను తొక్కుకుంటూ స్టేషనుకు పడిపోవాలి. ఏనిత్యోభ తనకు వచ్చిపడింది? ఈమినప్పప్పు నానబోసి కొరివిదయ్యంలా కోటిముందు కూర్చుని అర్ధరాత్రివరకూ రుబ్బుతుంది గావల్ను.

సుబ్బయ్య గడపయెక్కి పాదం యింట్లో మోపేసరికి యిల్లాలి తెల్లటి పాదమొకటి రెండూ సమీపంగా వచ్చి...రహస్యంగా నవ్వుతూ...'పాపం అత నొక్కడే యిల్లు







వెతుక్కుంటూ-' అశ్వత్థామ హతః కుంజరః అన్నట్లయింది.

'కిరసనాలు దీపం భగ్ భగ్ మంటూ చిందులు త్రొక్కుతోంది. నడవలో మడత మంచంమీద మానవాకారం...ఒకరిద్దరు పిల్లలు చీకట్లో అతడి భుజాలమీద సర్కస్ ఫీట్లు కానిస్తున్నారు.

'ఓహ్హో - ఎప్పుడూ ...' మాట పెగిలి వచ్చింది సుబ్బయ్యకు...

'అంతా కులాసా...'

అల్లుడు బూడ్సులు విప్పుకుంటూ ఖుర్ర టకాయించాడు. సుబ్బయ్యభార్య అందు

# ★ ఏది స్వర్గం? ఏది నరకం? ★

కుంది - 'ఎప్పుడనగా వెళ్లారు? చప్పున వస్తారేమో అట్లా స్టేషనుకు...'

వెధవ స్టేషను - యింకా స్టేషనే అంటూ అఘోరిస్తుందేం? సుబ్బయ్యకు చిరాకెత్తుకొస్తోంది.

సుబ్బయ్యభార్య పిల్లల్ని హోల్డాలు మీదనుంచి లేవగొడూ 'ఆ వెధవబర్నరు... కాస్త దీపం సరిచేయండి. నేను యిట్టే కాఫీ కలుపుగొస్తాను.' అంటూ నిష్క్రమించింది.

'వెధవ కాఫీ భోజనాలప్పుడు యిప్పుడెందుకు?' అన్నముక్క నాలికచివరిదాకావచ్చి చేసేది లేక హరికేన్‌లాంతరు ముందు కూర్చుని సుబ్బయ్య వత్తులు పట్టసాగాడు.

సుబ్బయ్య భార్య చలాకీగమనిస్తున్నాడు,

'హోసేవ్ అమ్మడూ - బంగాళాదుంపలు సన్నగా తరగాలిసుమా. కాఫీపొడుం డబ్బాకుంపటిప్రక్కనుంది. నీళ్లు మరగ్గానే దించేసి...మీ నాన్న కెందుకు మళ్లీ రాత్రి నిద్రపట్టదని విసుక్కుంటారు. నేను కాగుపడేస్తాను వేన్నీళ్ళకు...' అంటూ మరో ఐదునిమిషాలుపోయాక నడవలోకొచ్చి 'ఆ దీపం అల్లావుంచి వొక్కమాటు యిలా వస్తారూ?' ఎంత ముద్దుగా పిలుస్తోంది అనుకున్నాడు లేచివెళ్తూ సుబ్బయ్య. దొడ్లోకి వెళ్లాక రహస్యంగా 'కాస్త యీ పేడు రెండుబ్రద్దలు చేసిపెట్టరూ?' అని దుంగను చూపించి గొడ్డలి తెచ్చి ముందుపడేసి 'వేడీన్నీళ్లు కాచాలి - నీళ్ళపొయ్యిలోకి...' అని పురమాయించింది.

సుబ్బయ్యకు పై ప్రాణాలు పైకి లేచిపోయాయి. గొడ్డలిని తీసుగుని కాళ్ళతో దుంగను సర్దుతూ ముందుకు వంగాడు.

'బాగుందే వరస - కాఫీ కాచి అల్లా నిలబడిపోతావే! పట్టుగెళ్లియిచ్చీ...' ప్రబిమాలుతోంది తల్లి, మొత్తానికి వెనకనుంచి నెట్టగా నెట్టగా అమ్మడు కాఫీగ్లాసు పుచ్చుకుని వరండాలోకి నడిచింది. మడతమంచంమీద విగ్రహంలాకూర్చున్న అతడ్ని చూడగానే అమ్మడికి చెయ్యి కాస్త వణికింది. దప్పున క్రిందవుంచి పరుగెత్తుకు యింట్లోకి పోదామంటే వనుక రాతుసిలా తల్లి. అత నేమన్నా పలకరిస్తే బాగున్నని పించింగి. అల్లా పుచ్చుకుని అరనిమిషం నిల్చున్నాకకూడా అత నేమీ పలకరించలేదు. అమ్మడే ధైర్యంగా 'యింద కాఫీ...' అనగల్గింది అతను 'అక్కర్లేదు. యిప్పుడే పుచ్చుగొచ్చాను.' అనేసరికి అమ్మడు మరేమీ తోచక 'చల్లారిపోతుంది. తీసుగోండి.' అనేసి గాజులచేతిని కాస్త ముందుకు చాపి అభ్యర్థించింది. అదృష్టవశాత్తూ లోపల్నుంచి తల్లి 'స్నానానికి లేస్తాడేమో కనుక్కో' మని పొలికేక పెట్టడంతో - అతను 'ఇప్పుడేం తొందరలేదు- కాస్సేపాగి చేస్తాను' అన్నాక కాఫీగ్లాసు మంచం కోడుమీద వదలి అమ్మడు లోనికి తుర్రుమని పారిపోయింది.

ఉదయం తలంట్ల సరంజామా - సుబ్బయ్యకు నూరిపోసి బట్టలు తెమ్మని పంపించింది వీధిలోకి. అల్లుడు ఎనిమిది దాటాక కాని మంచం దిగలేదు. సుబ్బయ్య భార్య నూతిదగ్గర గొప్పగా అల్లుడి రాకను గూర్చి అమ్మలక్కలతో ప్రసంగించి 'మళ్ళీ భోజనాలు ప్రొద్దుపోతాయి - వంట కావాలి.' అని ఒకమాటు మూతి విరిచింది. 'ఏమండి పిన్నిగారూ - యేవిటి పిండివంటలు...' అన్నాక 'సేమ్యాపరమాన్నం -గోధుమ పూరీలు - గారెలూ' అని లోనికి వచ్చి 'ఏమే మీ ఆయన్ను లేవమను...' అమ్మడు నడవలోకివచ్చి తొంగిచూసింది. అతగాడు బద్ధకంగా ఆవులిస్తున్నాడు.

'తలంటు పోసుగోరూ...'

'ముఖం కడుక్కోకుండానే-' అతను చిరునవ్వు విసిరాడు. అమ్మడు నాలిక కర్చుగుని లోపలికి వెళ్ళి చెంబూ నీళ్ళూ తెచ్చి యిచ్చింది.

తొమ్మిది గంటలకు మంగలివచ్చి అల్లుడిని కబుర్లలోకి దింపాడు. అత్తగారు వొకమాటు తొంగిచూసి 'ప్రొద్దుపోకుండా నీళ్లు పోసుగుంటే...' అని నీళ్ళు నమిలింది. అమ్మడు రెండు తువ్వాళ్లను తెచ్చి మంచంమీద వేసింది. అల్లుడు స్నానానికి సిద్ధమై ముందుకు నడిచాడు. మంగలి నూనెగిన్నె చేత్తో పుచ్చుగుని అనుసరించాడు.

పావుగంట మర్దనా అయాక అల్లుడికి వొళ్ళు చిటపటలాడుతున్నట్లు తోచింది. తలమీది చవురు కళ్ళలోకంటా కారుతోంది. మంగలి తన తలమీద రెండు చేతుల్తో వాడికొచ్చిన దరువులన్నీ వాయిస్తున్నాడు. ఎండ చురచురమంటోంది. వళ్ళు భగభగమనిపించగా వుండబట్టలేక 'యేవిటీ చవురు?' అనేశాడు.

'ఆవనూనె...' అని వచ్చింది ప్రత్యుత్తరం. మంగలి యింకా వర్ణించిచెప్పాడు' ఆవనూనెతో తలంటుగునే బంగాళీవాళ్లంత గొప్పవాళ్లయారు.'

చర్మం ఎర్రగా కందిపోతోంది. ఇదేదో కుట్రగా అనుమానించి చేసేదిలేక అల్లుడు 'యీ గండం గడిచి బైటపడితేచాలు-' అన్నట్లు తనలో మ్రొక్కుకున్నాడు.

సుబ్బయ్య ఆఖరి సంతానం యిద్దరు పిల్లలూ బావయ్య నీళ్లుపోసుగోవడం చిత్రంగా గమనిస్తూనే వున్నారు. మొత్తానికి స్నానం పూర్తయేసరికి అల్లుడిముఖం కందగడ్డలా అయింది.

అతను బట్టలు వేసుగుంటూండగా అమ్మడు కాఫీ ఫలహారాలు పుచ్చుగుని దర్శన మిచ్చింది. 'నాకేం అక్కర్లేదు - నేను బజారుకు వెళ్తున్నాను.' అన్నాడు ముఖం తిప్పకుండా.

అమ్మడు గతుక్కుమంది. 'ఫలహారం చెయ్యరూ?'

'చాలు.' అన్నాడు విసురుగా.

ఇంకేం రావలసిన కోపమేదో అల్లుడిగారికి ముందుగానే వచ్చేసింది. చిన్న తమ్ముళ్లిద్దరూ గడపదగ్గర కాసుక్కూర్చున్నారు; బావయ్య వద్దన పంగిడవు ఫలహారపు పళ్లెంమీదకు వురకటానికి. అమ్మడు దీనంగా అలా నిలబడిపోయింది చూస్తూ. అతను ఇస్త్రీమడతల్చు వేసుగుని అలా చకచకా గుమ్మంవరకూ నడచాడు. సుబ్బయ్య భార్య గొంతుక 'బాబూ' అని వెనుకనుంచి కట్టి నిలేసింది.

'మీ మావగారు యిప్పుడే వస్తారు. అలా వెళ్ళారు బట్టలకోసం ... కొంచెం ఆగు నాయనా.' అని సాశ్చర్యముఖియై 'అదేవిటే - ఫలహారప్పళ్లెం పుచ్చుగుని అలా నిల్చున్నావు? ఏం చెయ్యలేదూ...'

అల్లుడి నుద్దేశించి 'ఫలహారం కాఫీ పుచ్చుగోకుండా వెళ్ళిపోతున్నావే నాయనా...'

'అర్జంటుగా పనుందండీ - వెళ్ళాలి.' అని తల త్రిప్పకుండానే విస్సురుగా అన్నాడు.

సుబ్బయ్య భార్య అమ్మడిని కళ్లతో ప్రశ్నించింది యేం యేవిటి జరిగిందని. అల్లుడికి కోపంరావటం ఆవిడా ప్రత్యక్షంగానే చూస్తూవుందాయె. ఇందరు నడవలో చేష్టలుడిగి చూస్తూండగా అతను సరాసరి మెట్లన్నీ దిగి వీధిలోకి వుడాయించేశాడు. ఈమధ్యలో కాళ్ళీడ్చుగుంటూ వచ్చాడు సుబ్బయ్య. చిన్నపిల్లలిద్దరూ బావయ్యకు మంగలి తల యెలా అంటినదీ వర్ణించి అభినయంతో చెప్పారు.

సుబ్బయ్య భార్య ముఖంలోకి ఎగాదిగా చూసి 'యేవిటి యేం జరిగింది?' అన్నాడు. ఆవిడ రహస్యంగా చేతులూపుకుంటూ అల్లుడికి కోపం రావటాన్నిగూర్చి తెలియ చెయ్యటంతో - ఆవిడ వుద్దేశించినట్లు సుబ్బయ్య మూర్ఛపోయివుండాలిసింది. అట్లాటి దేమీ లేకుండానే అతను చంకనున్న బట్టల పొట్లాన్ని భార్య చేతిలో వుంచాడు.

అమ్మడు గడపవద్దని నిలబడిచూస్తోంది. భార్య కిరుప్రక్కలా యిద్దరు పిల్లలూ నిలబడ్డారు. ఆవిడ ఆ పొట్లాన్ని విప్పతోంది.

సుబ్బయ్య ముఖాన నెత్తురుచుక్క లేదు. ఒక రెడీమేడ్ పొట్టిచేతుల చొక్కా, కాకీ పంట్లామూ అమ్మడికో పువ్వుల వాయిలుచీర జాకెట్టు గుడ్డా...సుబ్బయ్య భార్యకు వొళ్ళు మండిపోతోంది. అస్సలే అల్లుడు కోపంగా వున్నాడాయె...

'ఇవ్వేం బట్టలు...హవ్వ.' నోరు నొక్కుకొని పొట్లాన్ని నేలకేసి గట్టిగా చరిచింది.

'ఇంక ఎప్పటికి మీకు తెలిసిరావటం..'

'దానికేమే...నిక్షేపంలా. ఆ జత పదిహేను రూపాయలు...'

'ఆ కొట్టువాడి ముఖాన్నేసి కొట్టిరండి.'

'నోరు పారేసుగోకు అనవసరంగా. పాపం ఎట్లాగో అరువు పుట్టించుగొస్తే...'

'అయ్యో నాబొంద...అరువైతే డబ్బు పుచ్చుగోట్టండీ.'

'ఇప్పుడు వీటికేం తెగులు...'

'ఇచ్చేటప్పుడు కాస్త శుభ్రమైనవి యిచ్చుగుంటారా...యేది? రిస్టువాచీ తెస్తానన్నారే....'

రిస్టువాచీ కాదుగదా ఆఖరికి బిగ్ బెన్ కూడా కొని యిచ్చే పరిస్థితిలో లేడు సుబ్బయ్య.

'వో పదిహేను రూపాయ లిద్దామనుకుంటున్నాను.'

సుబ్బయ్య భార్య నెత్తిమొత్తుకుంటూ - అంది' చేతకానప్పుడు యెందుకు రానిచ్చారు?'

సుబ్బయ్య నసుగుతున్నాడు. 'చేతగాక పోటానికేముందే - నాయనా మాకీమాత్రం వుంది. యింతలో యింతఅని చెప్పి యిచ్చుగుంటాము.'

'ఈ రోజుల్లో రిస్టువాచీ లేకుండా యే అల్లుడన్నా గుమ్మం యెక్కుతాట్టండీ పండగకు.'

సుబ్బయ్యకు తన మావగారు అలకపాన్పు మీద యిస్తానని యెగవేసిన వెండిగ్లాసు జ్ఞప్తికొచ్చింది. నవ్వుతూ 'వాళ్ళు యేవో కోరటం మనం అల్లాగే అనటం మామూళ్లు. మరోమాటు వచ్చినప్పుడు చూసుగుందాం లేసరి!

'యేవిచేతగానిమాటలండీ.'

సుబ్బయ్య అక్కడనుంచి నిష్క్రమించాక ఆ కొత్తబట్టల్ని పుచ్చుగుని ఆవిడ సరాసరి లోనికి వెళ్ళిపోయింది.

ఇంటావిడ అనుకున్నదానికి రెండింతలుగా పిండివంటలు చేయాలిసొచ్చింది. గారెలకు ఆవడలు సఫిక్సుచేశాక పూరీలు కొన్నిలుచేసి వాటిస్తానే జిలేబీలు చేయటానికి ఆవిడ దిగబడిపోయింది.

ఆవిడవంట మూడుగంటలవరకూ తెమిలేట్టు లేదు. పదకొండుకొట్టగానే సుబ్బయ్య బరంపురంపంచె కట్టుగుని నడవలో తచ్చాట్లాడుతున్నాడు. అమ్మడు తల్లికి పనిలో సాయపడ్తోంది. పిల్లలుదిగాలుముఖాలేసుగుని చూస్తున్నారు. సుబ్బయ్య పొరుగువారింట్లో గడియారం గంటలు కొట్టడాన్ని లెక్కపెడ్తున్నాడు. పన్రెండు...అబ్బ...పదిగంటలకు నాలుగుమెతుకులుకొరికి ఆఫీసుకుపోయేప్రాణి. సుబ్బయ్య సాహసించి వంటయింట్లోకి తనముఖం చూపించి వచ్చాడు. అమ్మడు కొంచెం 'ఆగాలినాన్నా' అంది.

# ★ ఏది స్వర్గం? ఏది నరకం? ★

భార్య పళ్లు పిండుకుంటూ' అప్పుడే యేం పుట్టి మునిగిందని...అతగాడు రావద్దూ.

పిల్లలిద్దరూ అరుగులమీద కూర్చుని అల్లుడి కోసం యెదురుచూస్తున్నారు.

సుబ్బయ్య మడతమంచంమీలాక్కుని కొత్త వెన్ను వాల్చాడు.

వీధిలో 'చేమంతిపూల' కేక. పిల్లలు బిల బిలా తల్లితో చెప్పటానికిపరుగెట్టారు. అమ్మడు పూలు బేరవాడ్డానికి వీధిలోకి వచ్చింది. వందపావలా ... మూణ్ణాలికి ససేమిరా యివ్వనుగాక యివ్వనన్నాడు. కిష్టుడితల్లికి చక్కగా పెద్దజడ వేయటంవచ్చును. అమ్మడు తల్లినడిగింది. పూలు తీసుకున్నాక సుబ్బయ్య కోటంతా వెదికినా పావలా డబ్బులు లేవు. పొడుంకాయ చేతికి తగిలింది. వీధిలో పూలకుర్రాడు త్వరపెడ్తున్నాడు. కిష్టుడి తల్లినడిగి పావలా తెమ్మని తల్లి పురమాయించింది. అమ్మడు వీధిలోంచి కిష్టుడుగారింట్లోకివెళ్ళి పావలా అడిగేసరికి ఆవిడ గూడంతా సవరించి కొడుకుని పేరు పెట్టి పిలిచింది, కిష్టుడు తాను చదువు కొంటున్నాను రానుగాక రానన్నాడు. 'పాపం అమ్మడుకి పావలా కావాలిట - యీరూపాయి మార్చుకొచ్చి యిచ్చిరా...' అంది తల్లి.

కిష్టుడు పీలగా పొట్టిగా వుంటాడు. చురుకైన కుర్రాడు. స్కూలుఫైనలు గది తలుపు తీసుకుని నవ్వుతూ 'మరి ఆనక చదరంగం యెత్తువేసుగోటానికి వస్తానంటే...'

కిష్టుడి తల్లి అందుకుంది - 'దాని మొగుడొచ్చాక యింట్లో వుండక - నీతో చదరంగం ఆడ్డానికి కెట్లావొస్తుందిరా?'

కిష్టుడు 'వస్తానంటే...'

అమ్మడు తల వూయించింది. 'అయితే ఫో... నేను మీ యింటికే పట్టుకొచ్చి యిస్తాగా. అన్నట్లు మీఆయన్ను చూశావు గాదే?'

అమ్మడు తిరిగివచ్చి మెట్లెక్కుతూండగా - ఎదురుకుండా విగ్రహం నిలబడివుంది. పూలకుర్రాడు 'డబ్బులు తే అమ్మాయో వాలి.' అని విసుక్కుంటున్నాడు.

కిష్టుడు జువ్వలా రివ్వుమని పరుగెత్తుకొచ్చి అమ్మడు చేతిలో చిల్లర వుంచుతూ గుమ్మంలోంచి విగ్రహాన్ని ఎగాదిగా పరిశీలనగా చూసి నవ్వుతూ 'మీ ఆయనకు చదరంగం వచ్చా...' అని అమ్మడు నవ్వాక పరుగెత్తుంటూ వెళ్ళిపోయాడు. అమ్మడు యింట్లోకి బుర్రవంచుకుని వెళ్ళి పోతూంటే అతడు ఎర్రగా చూశాడు.

సుబ్బయ్య అవులిస్తూ చిటికెలు వేస్తూ మడతమంచంమీదనుంచిలేచాక - లేనినవ్వు తెచ్చిపెట్టుకుంటూ 'అబ్బోష్. ఒంటిగంట కాబోలు ... యింతాలస్యమైందే ... లేవోయ్. కాళ్లు కడుక్కో -'

సుబ్బయ్యభార్య పీటలమీద కూర్చుంటున్నప్పుడు పరీక్షగా చూసింది. అల్లుడి ముఖం యింకా ధుమధుమలాడ్తున్నట్లే వుంది. సుబ్బయ్యా తతిమ్మాయిద్దరు పిల్లలూ పదార్థాలమీదకు కలియబడ్డారు. అల్లుడికి అయ్యరుయిడ్లీ తాలీకు పులిత్రేనుపులు యింకా వస్తూండటంచేత చేసిన ఒక్క వస్తువయినా ముట్టలేదు. ఇది ప్రత్యక్షంగా సుబ్బయ్యభార్యకు గొప్ప అవమానం. ఆవిడ అనేకవిధాల సూచించిందికాని అతగాడు ఆఖరికి గేదె పెరుగుతోనన్నా ఒక్క ముద్ద నాలిక్కి రాసుగోకపోవటం ఆయింట్లో అందరికీ కష్టంగానే వుంది.

సుబ్బయ్య చాతకానివాడు వూరుకున్నా సరిపోను - 'ఏంవోయ్ డాక్టరుకు చూపించమంటారా...వొంట్లో కాస్త యేమన్నా-'

ఆ ఇంటావిడ హవ్వ అని నోరు నొక్కుకొని 'అవేం మాటలండీ. మీకు అథమూ శుభమూ తెలియదు మరీనూ -' అన్నాక హాస్యానికన్నట్లు నవ్వుతూ.

'ఏంనాయనా కోపం వచ్చినట్లుంది అవునా. మీ మావగారు రిస్టువాచీ యిస్తారులే' సుబ్బయ్యచేయి ముద్దతో నోటివద్ద ఆగిపోగా దీనితస్సచెక్క - యేంధైర్యవసాయిచ్చి మాట్లాడుతోంది. పిల్లికి చెలగాటం ఎలక్కి ప్రాణసంకటమూనూ. ఆవిడ అంతటితోపోనివ్వకుండా 'చూస్తూవూరుకొంటారేమండీ. అలాగే తెప్పించియిస్తాననిఅనండీ. ఆడదాన్ని నామాటమీద అతడికేం గురుంటుందీ' సుబ్బయ్యకు వళ్లు మండుకొస్తోంది. అణాస్టాంపు పట్టారాసియిస్తానని అనాలనుకున్నాడు.

అల్లుడు చేతులు కడుక్కోవటానికి లేచాడు. సుబ్బయ్యవంక గ్రుడ్లురిమి చూసింది భార్యామణి, చేసేదిలేక 'రిస్టువాచీ గురించి నువ్వనవసరంగా బెంగపెట్టుగోక ...' యింకా వాక్యం మధ్యలోనే త్రుంచేశాడు అల్లుడు.

'బెంగెవరికండీ.' అని.

అమ్మడితో తల్లిఅంటోంది-' మీనాన్నగారికి బొత్తిగా మాట్లాడ్డమే రాదు. శుద్ధ అసందర్భంగా అంటే - చేసేదీ చేస్తూ, అనవసరంగా అతడికా అనుమానం.' సుబ్బయ్య యేవిధంగా నన్నా అల్లుడ్ని ఎంగేజి చేయాలన్న వుద్దేశంతో—

'విశాఖపట్నం ఎలా వుంటుందని నీ వూహా?'

'ఏఁ' మన్నాడతను అయోమయంగా.

సుబ్బయ్య అల్లుడి పరిస్థితిని గమనించకుండా బుజా లెగురవేస్తూ 'హైదరాబాదు దొరికితే వారెవ్వా! మరో ఐదేళ్లకైనా—'

'.....................'

'గుంటూరూ బెజవాడా అంటారుగాని దీని తల్లి సిగదరగ - భోగులు భోగులుమంటూ...' సుబ్బయ్య బీడీ తీశాడు ముట్టించడానికి, అతడిభార్యా వచ్చి 'అతడు పడుకొంటాడేమో కాస్త, ఎందుకండీ అనవసరంగా వాగించి చంపుతారు?'

సుబ్బయ్యకు మాట్లాడ్డానికి యింకా 'బెరియాపురి - పాకీస్తాను అమెరికా సైనిక స్థావరాల వోషంబడిక' వుండగానే భార్య వచ్చి నోరు నొక్కేసింది. సుబ్బయ్య డిస్పాచరేగాదు - పేపరు అడపాతడపా చదువుతూంటాడు కూడా.

నాల్గుగంటలనుంచి కూర్చుంటే ఐదున్నరవరకూ కిష్టుడి తల్లికి, అమ్మడికి పెద్ద జడ వెయ్యటం పూర్తయింది. మంచి చీర గట్టుకోడానికని లేవబోతుంటే వీపుమీద చరిచి 'యింతకన్నా మంచిజడ కుడ్తాను పిల్లా యీమారు ..' అని ఆవిడ నవ్వితే అమ్మడు తెల్లబోయిచూసి తెలిచి తెచ్చుకుని తుర్రుమని పారిపోయి వచ్చేసింది. ముస్తాబు పూర్తయాక సుబ్బయ్యభార్య కూతురుని పిలిచి 'సాయంత్రం సినిమాకు వెళ్దామ'ని చెప్పు మీ ఆయనకు అని వుసిగొల్పింది. అమ్మడుకి ప్రొద్దుటనుంచి అతడి మొహంచూస్తేనే భయంగావుంది. గుండెలు దడదడా కొట్టుకుంటూండగా 'లేదు తప్పకుండా వెళ్ళాలి' అని చెప్పు అంది ముందుకు తోస్తూ తల్లి.

అమ్మడు వెళ్లేసరికి అతను దుస్తులు మార్చుకుని వీధిలోకివెళ్లే సన్నాహంలోవున్నాడు.

'సినీమాకు వెళ్దామండీ.' అంది నెమ్మదిగా.

అతను జడ చూపించటాని కొచ్చిందని అనుకున్నాడు కాబోలు.

'చెట్లు మొలిచినట్లు నెత్తినిండా వీపు నిండా యేవిటా వికారం?'

'..................'

'నాకు పనుంది. అర్జంటుగా వెళ్ళాలి.' అని చెప్పులు చప్పుడుచేసుకుంటూ అతడు వెళ్ళిపోబోతూంటే సాహసించి' సినీమాకు తీసుకెళ్ళాలి తప్పకుండా' అనేసింది అమ్మడు.

'వెళ్ళిపోయినాడాయేఁ?...ఇదేంమనిషి. యింత పెడసరమూ వెఱ్ఱివికారాలూనూ... ముద్దూ ముచ్చటా వుండొద్దూ, చెబితే వినే ఘటంకాదు. చేసుకున్న ప్రారబ్ధం?'

అంటోంది తల్లి. అమ్మడు విసుగ్గా - పళ్లీ వస్తారే -' అని అరిచింది.

సుబ్బయ్యభార్య లోనికి వెళ్ళిపోయాక కిష్టుడు చదరంగపు బల్లా బలం చేత్తోపుచ్చుగుని గుమ్మంలో నిలబడి 'వస్తానన్నావే నీకోసం యిప్పటిదాకా చూసి చూసి... ఏం వో యెత్తు వేసుకుందామా?'

అమ్మడు అయోమయంగా చూస్తూ నిలబడ్డది.

కిష్టుడు అడిగాడు 'ఏ మల్లాగున్నావ్? పోనీలే నేను వెడ్తాను' అని వెనుదిరగబోయాడు.

అమ్మడు 'వద్దు. రా వోయెత్తే నీతో ఆడ్తాను. చప్పుచప్పున ఆడేయ్యాలి. ఆలస్యం చెయ్యకూడదు' అంటూ చాప పరిచింది.

క్రొత్త చీర పెద్ద జడతో అందంగా హేమంతలక్ష్మిలా అమ్మడూ, పండగకు కుట్టించుకున్న క్రొత్తబట్టల్లో కిష్టుడూ, యిద్దరూ కూర్చుని చదరంగం ఆట కుపక్రమించారు.

సుబ్బయ్య భార్య మధ్యలో వొకమాటు వచ్చి తొంగిచూసి 'కిష్టుడూ జిలేబీలు తింటావట్రా...' అని అడిగింది.

'నా కిప్పుడేం అక్కర్లేదు పిన్నీ ఆటలో పడ్డాము.'

'ఐతే వాడు వెళ్లేముందు మన పిండివంటలు కొంచెం రుచిచూపించే—' అని అమ్మడికి హెచ్చరికజేసింది తల్లి.

'అహా!' అని యీమె తలవూయించింది.

మరో పది నిముషాలకి అమ్మడి మొగుడు సినీమాసన్నాహంలో టకటకజోళ్లుచప్పుడు చేసుకుంటూ యింట్లోకి వచ్చాడు. చదరంగంబల్ల కిష్టుడూ ఎర్రగా పావులూ బలం అగుపించాయి. అమ్మడు చటుకలేచినిల్చుని లోపలకు వెళ్ళిపోబోయి మళ్ళీ ఆగి 'వుండు కిష్టుడూ. జిలేబీ తినకుండా వెళ్తావా?'

'అక్కర్లేదు' అని బలం గొత్తుగుని కిష్టుడు అక్కణ్నుంచి వుడాయించేశాడు. అమ్మడు తలెత్తి చూసింది సినీమా వుత్సాహంలో.

అతడి కళ్లు భయంవేస్తున్నాయి చూడ్డానికి. మళ్ళీ తలకాయ వాల్చి కొద్దిగా వెనక్కు తిరిగింది.

'మొగుడిముందే అంత సిగ్గా...'

జోళ్ళచప్పుడు దగ్గరసా అయింది. పెద్ద జడ చేత్తో పుచ్చుగుని వొక్క గుంజు గుంజాడు.

అమ్మడు నిలువెల్లా గజగజా వణికిపోయింది.

'దొంగముండా—' చెంప ఛెళ్లుమంది. పవరం తెగిపోయింది కాబోలు. పూలన్నీ రేకులు రాలి క్రింద జలజలా రాలాయి.

అమ్మడికి పుడుకు మోతుతనం. అవమానం పెనవేసుకురాగా ముఖమెత్తి 'పండగపూట నన్నెందుకు కొట్టారు?' కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నై.

'త్రవ్వి పాతెయ్యాలి నీలాటిదాన్ని.'

అమ్మడు ద్వారబంధానికానుకుని వెక్కి వెక్కి యేడుస్తోంది.

సుబ్బయ్య భార్య దూరాన్నుంచి చూసి తల చేత్తోపట్టుగుని ముందుకు ధైర్యం చేసి రాలేక పొయ్యిదగ్గరకు పోయి చతికిలబడి 'ప్రయోజకత్వాలాని, వెధవ ప్రయోజకత్వాలు పండగపూటా ఆడబిడ్డమీద చెయ్యి చేసుగుంటాడూ?' అని ఒక్కమాటు చీదికళ్ళంతా ఎర్రబర్చుగుని 'దిక్కుమాలిన సంబంధం!' అని లోపల్లోపల తిట్లు చెరగ సాగింది.

చీకటి పొగలా క్రమ్ముకొస్తోంది. చలిగాలి తిరిగింది. సుబ్బయ్య సంక్రాంతి పూటా చీట్లాడి డబ్బు పోగొట్టుకున్నాననే విచారంతో దొంగలా ఇంట్లోకి వచ్చాడు. చూస్తే పొయ్యిదగ్గర యిల్లాలు చెంగుపర్చుకునివుంది. భయంవేసి ఆవిడను పల్కరించకుండా పెద్దగదిలోకి వెళ్ళి చూస్తే చాప మీద అడ్డంగా అమ్మడు పడివుంది. పండగ పూటా యింట్లో దీపం లేదు. నడవలో అల్లుడు కానరాలేదు. పిల్లలు వీధులో ఎక్కడో ఆడుకోటానికి వెళ్ళివుంటారు.

సుబ్బయ్యకు యేమీ అర్థంకాలేదు.

అమ్మడిదగరకెళ్ళి 'ప్రావిడెంటు ఫండులోంచి తీసి మీ ఆయనకు రిస్టువాచి తెప్పిస్తానుగా అమ్మా.' అనేసి వంట యింట్లోకి వెళ్ళి 'మనిషీ పండగపూటా దీపం వెలించావు కావేమే? లే...యిదేమిటి?'

సుబ్బయ్య భార్య లేస్తూ 'దిక్కుమాలిన సంబంధం తెచ్చి పిల్లపీకకు వురిబిగించేశాడు.' అని శాపనార్థాలు మొదలెట్టింది.

ఎవరూ ఎక్కువగా మాట్లాడుకోలేదు. అల్లుడు రాత్రిభోజనానికి లేవలేదు. తెల్లారి లేస్తూనే అతడు జట్కా తెచ్చి యింటి గుమ్మంముందర నిలిపి హోల్డాలును బండి కెక్కించబోతూండగా సుబ్బయ్య వచ్చి రెండుచేతులూ పుచ్చుగుని అన్నాడు.

'బాబూ నీకోసం బట్టలు తెచ్చాను. మళ్ళీ నెలనాటికి నీకు గడియారం కొని పెట్టకపోతే సుబ్బయ్య అమ్మకడుపునే పుట్టలేదనుకో...'

లాగూ చొక్కా తెచ్చి హోల్డాలులో పెట్టుకోమని సుబ్బయ్య అభ్యర్థించాడు.

'నేనేమీ పోస్టుజవాన్ని కాదండీ - యీ కోటుబట్టలు వేసుకుని తిరగటానికి.' పెటిల రంగా అని బండిలో ఎక్కి కూర్చున్నాడు.

పంతులుగారు ఎన్నిసార్లు చెప్పినా కుర్రవాడికి పాఠం బుర్రకెక్కలేదు. చివరికి ఎలాగైతేనేం కుర్రవాడికి పాఠం బోధపడింది. పంతులుగారు నిట్టూర్పు విడిచి "ఒరేయ్. నేను లేకపోతే నీ అంత పెద్ద గాడిద ఈ భూప్రపంచంలో ఇంకోడుండడు, అన్నాడు."

సుబ్బయ్య బండీ వెంట వడుస్తూ 'నాయనా నువ్వు అమ్మడిని చేయిచేసుకున్నావని నాకేమీ లేదు సుమా! నీకూ పిల్లలు పుడతారు. భగవంతుడు మేలుచేస్తే యీ కష్టం సుఖమూ నీకూ తెలిసివస్తుంది. ఈ సుబ్బయ్య డిస్పాచరు. తెలిసో తెలియకో మనమనుష్యులు తప్పుచేస్తే కప్పుకుంటాము. పేదవాణ్ని తలిచి నువ్వైనా నామాట మన్నించావు కాదునాయనా. మనస్సులో పెట్టుగోకు. యీ చాదస్తపు మాటలు చీకటిలో కలిసిపోతూండగా జట్కా గబగబా పరుగెత్తి అదృశ్యమైపోయింది. సుబ్బయ్య క్రొత్తబట్టల్ని బుజాన్నేసుగుని తిరిగివస్తూ యిది స్వర్గమా నరకమా అని యోజించుకుంటున్నాడు. ఈమారు కాళ్ళ క్రింద సూదుల్లాటి రాళ్ళుపడ్డా సుబ్బయ్య చలించలేదు. ★




**THE HUNCHBACK OF NOTRE DAME**

## 31

బికారులనివాసంలో పాడుపడిన కోట ఒకటుంది. శిథిలమై పోగా మిగిలిన కట్టడంలో క్రింద ఒక. పానశాల ఉంది. మిద్దెపైన కొందరు బికారులు నివాసం ఏర్పరచుకున్నారు. ఈ ప్రాంతంలో రాత్రిం బగళ్లు, సందడి ఉంటుంది. గుమ్మంపైన 'ఇతరులు లోనికి రాకూడదు' అని వ్రాసి ఉంది!

పానశాలలో మద్యసేవ, జూదం జోరుగా సాగుతున్నాయి. అందరూ మామూలుకంటె ఎక్కువ హుషారుగా ఉన్నారు. ప్రతి ఒక్కరిదగ్గరా పలుగో, కర్రో, ఇనపముక్కలో, అంపమో ఏదో ఒక ఆయుధం ఉంది.

గది విశాలమైనది. అయినా జనంతో కిటకిటలాడిపోతోంది; అక్కడ కర్రబల్లలమీద కొవ్వొత్తిదీపాలు వెలుగుతున్నాయి. ఒకప్రక్క సెగడు తీవ్రంగా మండుతోంది. జిప్సీరాజు తుప్పుపటిన డబ్బా ఒకటి కిరీటంగా ధరించి పెద్ద పీపాపైన ఠీవిగా కాలుమీద కాలు వేసుకుని కూర్చున్నాడు. కూర్చుని బికారులు తెచ్చిన ఆయుధాలు పరిశీలిస్తున్నాడు. పక్కనే పెద్ద ఆయుధాల గుట్టొకటి ఉంది. ఎవరికితోచిన ఆయుధం వాళ్ళు అందుకుంటున్నారు.

ఒకప్రక్క ఒకడు నిలువెల్లా ఇనపముక్కల కవచం అతుకులు పెట్టుకుంటున్నాడు. ఆ కవచంలోనుంచి అతడి కన్నులు, ముక్కు, కొద్దిజుట్టు, పెదవులుమాత్రం కనపడుతున్నాయి. ప్రక్క పొడుగాటి తుప్పుకత్తి ఒకటి వ్రేలాడుతోంది. బెల్టునిండా బోలెడు చిన్నకత్తులున్నాయి. ముందొక కూజానిండా సారాయి ఉంది. అతనిచుట్టూ కొందరు చేరి గేలిచేస్తున్నారు.

ఒకమూల గ్రింగైర్ పరధ్యానంలో పడి కూర్చున్నాడు. క్లోపిన్ అతిణ్ని పిలిచాడు : "ఊ! తెములు. త్వరగా వే. అందరం సిద్ధంగా ఉండాలి. ఇంక బయలుదేరాలి."

నిలువెల్లా కవచం ధరించిన యువకు డిలా అన్నాడు. "మిత్రులారా! నే నెవరో గుర్తుపట్టగలరా? నేను జెహాన్ ఫ్రాలోని: మనం ఇప్పు డొక అపూర్వమైన దండయాత్రకి బయలుదేరబోతున్నాం. మనంకూడా చాలా గొప్పవాళ్ళం. నడవండి. చర్చిని ముట్టడిద్దాం. తలుపులు బద్దలుకొట్టి లోపలికి పోదాం. మన జిప్సీ సుందరిని రక్షించుకుందాం. న్యాయమూర్తులబారినుంచి, మతాచార్యులబారినుంచి చర్చిగోడలమధ్యనుంచి ఆమెను కాపాడుదాం. చర్చిని దగ్ధం చేద్దాం. బిషప్ కనపడితే వాణ్ని ఆ మంటల్లో పారేసి హతిమార్చుదాం. అంతా చూస్తున్నంతసేపు పట్టదు. మనం న్యాయంకోసం పోరాడుతున్నాం. న్యాయంకోసం నాటర్ డామ్ చర్చిని దోచుకుందాం. క్వాసిమోడోని ఉరితీసేద్దాం. క్వాసిమోడో అంటే ఎవరో తెలుసా మీకు? సైతాన్ అపరావతారం......"

బికారుల హర్షధ్వానాల్లో, రణగొణధ్వనిలో అత డాపైన చెప్పినది ఎవరికీ వినరాలేదు. గ్రింగైర్ "భేష్! భేష్!" అంటూ లేచి బిగ్గరగా అరిచాడు. ఆనంద తన్మయతలో అతడి కళ్ళు తేలి ఆడుతున్నాయి. జిప్సీరాజు లేచి దేశదేశాల దయ్యాలు, భూతాల ఆకార వికారాది విషయాలు ఏకధాటిగా ఉపన్యసించ నారంభించాడు.

ఒక డన్నాడు : "పాపం ఎమరాల్డా! అది మన చెల్లెలు. మనం విడిపించాలి."

"ఆమె ఇంకా నాటర్ డామ్ చర్చిలోనే ఉందా?"

"ఏమో. పాపం!"

"పదండి చర్చికి" అని అందరూ కేకపెట్టారు.

"చర్చిలో బొమ్మలకూడా బంగారుతొడుగు లుంటాయి" అన్నా డొకడు.

"మనం పండుగ చేసుకోవచ్చు" అన్నా డింకొకడు.

మూలం : విక్టర్ హ్యూగో

అనువాదం : సూరంపూడి సీతారామ్

ఈరీతిగా అక్కడ ప్రసంగాలు కేకలు, అరుపులు చెలరేగుతున్నాయి అందరూ ఉత్సాహంతో యాత్రకి సన్నాహమౌతున్నారు. స్త్రీలు పురుషులు, పిల్లలు వృద్ధులు అందరూ ఉత్సాహంతో ఉడుకెత్తిపోతున్నారు.

జిప్సీలరాజు ఆయుధాలు పంచడం ముగించి, సెగదువద్ద కూర్చున్న గ్రింగోయిర్ వద్దకు వెళ్ళాడు: "ఏం కవీ! ఏమిటాలోచిస్తున్నావు?"

"మంటదగ్గిర కూచున్నాను–మంట కాగడంకోసం, పులు

#  ఘంటారావం 

కాచడంకోసం కాదు—మంటల్లో ఎగురుతున్న నెరుసులు చూస్తున్నాను. అవి అలా ఎగురుతూవుంటే ఎంతసేపైనా చూడవచ్చు. ఆ నెరుసులు చిమ్మీగొట్టందాకా ఎగురుతున్నాయి చూడు. అక్కడవి నక్షత్రాలమాదిరి, మరో లోకాలలా ప్రకాశిస్తున్నాయి..."

"ఏదో ధోరణి మొదలెడతావు. అదేం నాకు తుదా మొదలూ తెలియదు. అది సరే, ఇప్పుడు వేళెంతయిందో తెలుసా?"

"ఏమో తెలియదు."

"ఉ! లేవండి! అందరూ బయలుదేరండి. మహారాజు పారిస్‌లోనే ఉన్నాట్ట."

"అందుకే ఆమెని వెంటనే విడిపించాలి" అన్నాడొకడు.

"అక్కడ మనకేం భయంలేదు. చర్చి తేలిగ్గా మన చేతుల్లో పడుతుంది. ఫిరంగులు పాపం ఏపాపం ఎరగవు. కళ్ళుమూసుకొంటాయి. మనదే అక్కడ బలం. రేపు పోలీసులు చర్చిలోకి వెళ్ళి వెతుక్కొంటారు. ఆమె కనపడకపోతే వెర్రిమొహాలు వేసుకు వెళ్ళిపోవాలి. ఆమె నురితియ్యడానికి వీల్లేదు. మనమే కాపాడాలి." అన్నాడు క్లోపిన్.

గ్రింగైర్ మెల్లిగాలేచి చుట్టూ సందడి చూశాడు.

"బయలుదేరండి" అని పొలికేక ఒకటి వినపడింది.

అప్పటికి మబ్బులుకమ్మి వెన్నెల మందగించింది. బికారులు బిలబిలా వీధిలోకి వచ్చిపడ్డారు. అక్కడక్కడ కొందరు నాయకులు అందరినీ ఒక క్రమంలో సర్ది నడిపించడానికి ప్రయత్నిస్తున్నారు.

అందరూ చకచకా నడుస్తున్నారు. భుజాలపైన పలుగులు, అంపాలు, గొడ్డళ్ళు, బండకర్రలు, ఆకారంలేని ఇనపముక్కలు నిలబెట్టుకొని ధూకుడుగా నడుస్తున్నారు. వీధులు గడిచి నడుస్తున్నారు. వందలాదిగా వస్తున్న ఈ బికారిమూకను చూసి ఆ వీధుల్లో గస్తీ పోలీసులు పారిపోతున్నారు.

బికారిమూక చౌకువద్దకు వచ్చింది.

"ఇశ్! ఇకమీద అందరం నిశ్శబ్దంగా నడవాలి. ఈ రాత్రి వేళ ఎవరూ మేలుకోకూడదు. ఒక్కరొక్క మాట పలక్కూడదు. కిక్కురుమనకుండా నడవండి" అన్నాడు క్లోపిన్.

చీకటిలో నిశ్శబ్దంగా గబగబా వస్తున్న ఈ మూకనిచూసి గుర్రాలపై గస్తీ తిరుగుతున్న పోలీసులకు అదేమిటో బోధపడలేదు. కారుమేఘ మొకటి నగరంలోకి దిగి వీధుల్లో నడుస్తున్నదా అన్నట్లుంది.

అప్పటి కింకా చర్చిలో క్వాసిమోడో నిద్రపోలేదు. చివరిసారి చర్చిఅంతా తిరిగి తలుపులు బిగించివచ్చాడు. ఒకసారి గంటలవంక చూసి పలకరించి వచ్చాడు. గోపుర మెక్కి చూశాడు. మేఘావృతమైన ఆకాశంక్రింద చీకటిలో పారిస్ నగరం నిద్రపోతోంది. నల్లని ఈచీకటి మధ్యలో తెల్లని ఛాయలా సీన్‌నది మెలికలు తిరిగి ప్రవహిస్తోంది. దూరాన ఎక్కడో ఒక్కచోటమాత్రం మిణుకు మిణుకు మంటున్న దీపం కనపడుతోంది.

అలా నిలబడి చూస్తూఉంటే అతడి కెందుకో లోలోపల తెలియరాని భీతిఏదో పుట్టింది. కొన్ని రోజులుగా రాత్రివేళ మెలకువగా ఉండి చర్చి పరిసరాలు జాగ్రత్తగా పరిశీలిస్తున్నాడు. ఎవరో కొందరు రాత్రివేళ చర్చిపైనే కళ్ళుంచి ఆ పరిసరాలలో మసలుతున్నట్లు కనపడిం దతనికి. జిప్సీయువతిని అపహరించడానికేదో భయంకరమైన కుట్ర జరుగుతున్నదని అతడికి అనుమానం కలిగింది. తనపై పగబూనినట్టే లోకమంతా ఆమెపై పగబట్టిందని భావించాడు. అందువల్ల కొన్ని రాత్రులనుంచి అతడు నిద్రమాని గోపురంపై నిలబడి వెయ్యికళ్ళతో చూస్తున్నాడు

అలా చూస్తుండగా దూరాన ఒకచోట ఏదో నల్లనిముద్ద ఒకటి కదులుతున్నట్లు అతడికి కనపడింది. సీన్‌నదివంక జాగ్రత్తగా చూశాడు. ఏదో నల్లని సమూహం నది దాటింది. కొంతసేపటికి అది ఇళ్ళు, భవనాలవెనుక చాటు పడింది.

మరొకరికైతే కొన్ని వందలమంది నడిచిన కాళ్ళ చప్పుళ్లు వినపడవచ్చుకాని క్వాసిమోడోకి వినపడలేదు. కొంతసేపటికి కొకవీధిలో ఆ సమూహం కానవచ్చింది. ఇప్పుడు మనుష్యులతనికంటికి కనపడ్డారు. అతడికేమిచెయ్యాలో తోచలేదు. ఆమెను లేపాలా? చర్చినుండి ఆమెను తప్పించాలా! ఎక్కడికి? ఎలాగు? వీధుల్లో గస్తీ ఉంది. చర్చి వెనుకవైపున నది ఉంది. అక్కడ పోనైనా లేదు. ఇంక వేరుమార్గంలేదు. గుమ్మంవద్ద అడ్డు నిలబడి ప్రాణాలకు తెగించి తుదివరకు పోరాడక తప్పదు. ఆమెను లేపకూడదు. తను చచ్చినతరువాతకాని ఆమెకు అపకారం జరగకూడదు.

నిశ్చయానికొచ్చి ఇంక వస్తున్న ఆ సమూహంపైనే దృష్టి నిగిడ్చిచూస్తూ అక్కడే నిలబడ్డాడు.

క్రమక్రమంగా సంఖ్య పెరుగుతోంది. కాని ప్రక్క ఇళ్లలో కిటికీలు తెరుచుకోడంలేదు. అందువల్ల అందరూ నిశ్శబ్దంగా వస్తున్నారని క్వాసిమోడో ఊహించాడు.

ఉన్నట్లుండి అకస్మాత్తుగా కాగడాలు కనపడ్డాయి. ఆ కాగడాల వెలుగులో కొందరు బికారుల ముఖాలు కనపడ్డాయి. మూర్ఖాగ్రేసరుని ఊరేగింపు, అప్పుడక్కడ చేరిన మూక అతడికి గుర్తువచ్చింది.

అందరూ చౌకులో చర్చిముందు చేరారు. ఇప్పుడీ దండయాత్ర జిప్సీ యువతిని అపహరించడానికేనని క్వాసిమోడో రూఢిపరుచుకున్నాడు. క్వాసిమోడో దీపం చేత తీసుకుని రెండు గోపురాలమధ్య మిద్దెమీదికి వచ్చి నిలబడ్డాడు.

క్లోపిన్ బికారుల్ని చర్చిముట్టడికి సన్నాహం చేశాడు. వెనుకవైపు హఠాత్తుగా పోలీసులుకాని రాజ సైనికులుకాని వస్తే రక్షణకోసం అన్నివీధుల మొగలలోనూ కొందరు కొందరిని కాపుదల ఉంచి, మిగిలినవారందరినీ చర్చి ప్రవేశించడానికి ఆయత్తం చేశాడు

మధ్యయుగాలలో నగరాలలో ఇటువంటి దాడులు వింతగావు. ఆనాడు ఇప్పుడున్నట్టు పోలీసుదళా లుండేవికావు. నగరాలు ఏ ఒక్క అధికారి రక్షణలోనూ ఉండేవికావు. రాజరికవంశస్థులు, సామంతులు ఎవరికి వారు సైన్యాలను రక్షకదళాలను నిర్మించుకు నేవారు. ప్రతి నగరంలో అనేకుల రక్షకదళా లుండేవి. ఎవరి ప్రాంతానికి వారు చక్రవర్తులు. నగరమంతటినీ ఈ సామంతరాజులు పంచుకునేవారు. అందరూ నూటవరుసకి మాత్రం మహారాజు అధికారానికి లోబడినట్లుండేవారు. అవకాశాన్నిబట్టి వారు మహారాజు నెదిరించడమో, బలపరచడమో జరిగేది. ఎవరికివారు కోటలుకట్టుకు నే వారు. చర్చిలు మాత్రం ఎవరూ ఆక్రమించరానివిగా, బిషప్ అనుమతి లేనిది ప్రవేశించరానివిగా పరిగణించబడేవి. ఆకాలంలో అవర్ణాల కుట్రలవల్లనో, బికారులు, జిప్సీలవలనో దోపిళ్లు జరిగేవి. దోపిళ్లు దాడులు జరిగినప్పుడు ఇరుగుపొరుగులు తలుపులుమూసుకుని ఊరుకునేవారు. ధనాఢ్యులు కోటలు కట్టుకుని ఆస్తిపాస్తులు కాపాడుకునేవారు. కొన్ని చర్చిలకుకూడా ముందు కోటలు నిర్మించారు. కాని నాటర్‌డామ్ చర్చికి అటువంటి రక్షణ లేదు.

బికారు లందర్నీ సిద్ధపరిచ్చిన తరువాత క్లోపిన్ తన చేతిలోని కాగడా పైకెత్తి నాటర్‌డామ్ చర్చి గోపురంవంక చూస్తూ బిగ్గ

రగా అరిచాడు: "మా జాతికి చెందిన సోదరిని మా కప్పగించండి. మీ చర్చిలో ఆశ్రయం తీసుకుందని పార్లమెంటు డిక్రీ చెయ్యబోతోంది. ఆమెని వెంటనే మా కప్పగించి మీ చర్చి కాపాడుకోండి. అప్పగించకపోతే మీ చర్చి ధ్వంసంకాక తప్పదు. ఇదిగో మా జండా. ఇక్కడ నిలబెడుతున్నాం."

క్వాసిమోడోకి ఒక్క మాటకూడా వినపడలేదు. ఎర్రటి గుడ్డపేలిక కట్టిన జండా ఒకటి రోడ్డుమధ్య పాతబడింది.

చర్చిలో సవ్వడైనా వినరాలేదు. క్లోపిన్ చూశాడు. "పదండి ముందుకు" అని బిగ్గరగా అరిచాడు.

ముప్పైనలభైమంది గొడ్డళ్ళతో పలుగులతో చర్చిద్వారం సమీపించారు అందరూ మెట్లెక్కి తలుపులు గెంటారు. తలుపులు కదల్లేదు. "అబ్బ! చాలా గట్టిగా ఉన్నాయి" అన్నాడొకడు.

"పరవాలేదు తలుపులు పగలకొట్టండి" అన్నాడు క్లోపిన్.

అందరూ ఎగబడి తలుపులు బ్రద్దలుకొట్ట నారంభించారు. ఇద్దరు తాళం బ్రద్దలు కొట్టడం మొదలుపెట్టారు. క్లోపిన్ అందరినీ హెచ్చరిస్తున్నాడు.

ఇంతలో హఠాత్తుగా వెనకవైపునుంచి పెద్దధ్వని వినవచ్చింది. గోపురం కూలిపోయిందని కొందరు భ్రమించారు. కాని అదొక పెద్ద దూలం. పైనుంచి భికారులపైన విరుచుకు పడింది. కొందరు భయంకరంగా ఆర్తనాదం చేశారు. మెట్లపైనున్నవారిలో డజనుమంది దూలంకిందపడి నలిగిపోయారు. మిగిలినవారందరూ దూలానికి దూరంగా పారిపోయారు. త్రుటిలో చర్చి ప్రాంగణం ఖాళీ అయిపోయింది.

"సరిగ్గా నేనక్కడే ఉన్నాను. వీసంలో తప్పింది. లేకపోతే నేనుకూడా చచ్చిపోదును" అన్నాడు జెహాన్.

భికారులకు పిరికిపుట్టింది అందరూ నిశ్చేష్టులై కొంతసేపు ఆకాశంవంక, చర్చిగోపురంవంక చూశారు.

"ఇదేదో ఇంద్రజాలంలా ఉంది" అన్నాడు జిప్సీల రాజు.

"చంద్రుడు దేవుడు. మనమీద దూలంపడేశాడు" అన్నాడొక భికారి.

"నీ మొహం. నీకేం తెలుసు? చంద్రుడు మన దేవుడు. మనకి అపకారం చెయ్యడు" అన్నాడింకొకడు.

క్లోపిన్‌కి ఈ దూలం ఎలా వచ్చిపడిందో అర్థంకాలేదు. చర్చిపైన ఒక్క ప్రాణి కనపడలేదు. మెట్లపైన దూలం నిశ్చలంగా పడిఉంది.

"ఊ! కానివ్వండి" అన్నాడు క్లోపిన్ అందరూ రాళ్ళు, కర్రలు, ఇనపముక్కలు, బాణాలు చర్చి ద్వారంమీద ప్రయోగించారు.

"పదండి ముందుకి" అని అరిచాడు క్లోపిన్. కాని ఎవ్వరూ కదల్లేదు.

ఈమారు ప్రక్క ఇళ్లలో కిటికీలు తెరుచుకున్నాయి. తెగుచుకున్నదే తడవుగా "కాల్చండి తుపాకులు" అని క్లోపిన్ అరిచాడు. వెంటనే కిటికీలు మూసుకున్నాయి. జరుగున్నదేమో తెలియక ఇరుగు పొరుగు ప్రజలు భయపడ్డారు ఆరోజుల్లో ప్రాణహానికీ మానహానికీ పౌరులు భయపడక తప్పలేదు.

"ముందుకు పదండి" అని అరిచాడు క్లోపిన్. చర్చిపైన తుపాకులు మోగాయి.

"ఆగండి." అన్నాడు క్లోపిన్. అందరూ ఆగిపోయారు.

"ఈ దూలంఎత్తి తలుపులు బద్దలుకొట్టండి."

అందరూ సంతోషంతో కేకలుపెట్టారు. రెండువందలమంది దూలం ఎత్తారు.

దూలం దెబ్బకి ఇనప తలుపులు ఖంగున మోగాయి కాని విరిగిపోలేదు. చర్చిమాత్రం కదలాడిపోయింది.

ఉన్నట్టుండి ముందున్న జనంపైన రాళ్ళవర్షం కురిసింది.

"చిత్రంగ ఉందే! చర్చి శిల్పాలు విరిగి మనమీద పడుతున్నాయా?" అన్నాడు జెహాన్.

తరవాత ఒక్కొక్కటి చొప్పునరాళ్లు బలంగావచ్చి భికారులకు తగలడం మొదలుపెట్టాయి తరవాత పెద్దపెద్ద రాళ్లుపడ్డం మొదలుపెట్టాయి. కొందరికి తలలు చితికాయి. కొందరు కాళ్లు విరిగి, నడుములు విరిగి కూలిపోయి రోదించ నారంభించారు. అప్పటికే చాలమందికి గాయాలు తగిలాయి.

ఇదంతా క్వాసిమోడో రక్షణకోసం చేస్తున్నదని వేరే చెప్పనక్కరలేదు. క్వాసిమోడోకి మొదట ఏం చేయాలో తోచలేదు. అటూ ఇటూ కంగారుతో పరుగులెత్తాడు. చర్చిగంటలు మోగించి అందరినీ లేవగొట్టా లనుకున్నాడు. కాని గంటలు మోగేలోపల భికారులు తలుపులు బద్దలుకొట్టవచ్చు. ఆ సమయంలో అతడికి జ్ఞప్తి వచ్చింది—చర్చి మరమ్మతుచేయడానికి వడ్రంగులు కొన్ని సామానులు చర్చిలో దాచిపెట్టారని. ఒక గోపురంలో మిద్దె సమీపంలో దూలాలు, ఇటుకలు, రాళ్ళు ఉంచబడినాయి. వెంటనే క్వాసిమోడో అక్కడికి పరుగెత్తాడు. మిద్దెపక్క పెద్ద గదినిండా సామానుంది. అక్కడే రాళ్ళగుట్ట లున్నాయి, సీసంముద్దలున్నాయి, దూలాలున్నాయి, కంకరగుట్ట లున్నాయి. ఇంక జాప్యం చెయ్యడానికి వీల్లేదు. ఉన్నవానిలోకెల్ల పెద్దదైన దూలం ఒక చివర పట్టుకుని బరబర ఈడ్చుకువచ్చాడు. ఆ దూలాన్ని లాగగల సత్తువ ఆ క్షణంలో అతడి కెలా వచ్చిందో ఆశ్చర్యకరమైన విషయం. సరిగ్గా మెట్లకుమీదుగా లాక్కువచ్చి కిందికి గెంటాడు. నూట అరవై అడుగుల ఎత్తునుంచి అది బ్రహ్మాండమైనశబ్దం చేస్తూ, అడ్డవచ్చిన శిల్పాలను, తూముగొట్టాలను విరగ్గొట్టుతూ వచ్చి భికారులపై పడింది. భికారులు చెదరిపోవడం క్వాసిమోడో పైనుంచి చూశాడు. తరువాత రాళ్ళూ, కంకరరాళ్లూ తీసుకువచ్చి భికారులపై బలంకొద్దీ రువ్వనారంభించాడు. పెద్దపెద్ద బండరాళ్లను దొర్లించాడు. చర్చి కూలిపోతున్నదని భికారులు మొదట భయపడ్డారు. ఆ క్షణంలో క్వాసిమోడోని చూసినట్లయితే భికారుల గుండెలు పగిలి పారిపోయేవారే! మిద్దెపైన తన యెత్తు రాళ్ళగుట్ట పేర్చిఉంచాడు! ఒక్కొక్క రాయి ఒక్కొక్కడికి తగిలి అరుస్తూవుంటే క్వాసిమోడో సంతోషంతో గంతులేస్తున్నాడు.

రాళ్లదెబ్బలను లక్ష్యపెట్టకుండా భికారులు మళ్లీ దూలంతో తలుపులు బద్దలుకొట్టడం మొదలుపెట్టారు. కొంతసేపటికి గడపలు, తలుపులు బీటలు వారసాగాయి. చర్చి అంతా దద్దరిల్లిపోతోంది. ద్వారంపై చెక్కడాలు ముక్కలై ఎగురుతున్నాయి. ఉతకలుసాగి ఊగులాడుతున్నాయి.

ఇంక తలుపులు పగిలిపోక తప్పదని క్వాసిమోడో గ్రహించాడు. శబ్దం వినబడకపోయినా చర్చి చలించిపోవడం అతనికి తెలుస్తూనే వుంది. రాళ్లవర్షంవల్ల భికారులు ఆగడంలేదు. క్వాసిమోడో మెట్లవంక తొంగిచూశాడు. పైనుంచి తూము గొట్టాలు కనపడ్డాయి. మిద్దెమీది వాననీరు ఆ గొట్టాలగుండా మెట్లమీదా, ముందు రోడ్డుపైనా పడుతుంది. క్వాసిమోడోకి ఒక ఉపాయం తట్టింది. గబగబవెళ్ళి లోపలినుంచి పెద్దమోపెడు చితుకులు తీసుకువచ్చి రెండుతూములవద్ద పేర్చాడు. వానిపైన సీసపు ముద్దలు కొన్ని పేర్చి తన దీపం సహాయంతో నిప్పు అంటించాడు. రాళ్ళవర్షం ఆగిపోగానే భికారులు పైకి చూడ్డం మానేసి దృష్టి ద్వారంవైపు కేంద్రీకరించారు. పైన అతడు మంటపెట్టడం ఎవరూ గమనించలేదు. అందరూ తలుపులు ఎప్పుడు విడివడతాయో, లోపలికి దూకి ముందు చేతికిచిక్కినవి దోచుకోవాలనే ఆత్రుతలోఉన్నారు. తలుపులు కదిలిపోతున్నకొద్దీ అందరికీ ఉత్సాహం ఇనుమడిస్తోంది. చర్చిలో వెలలేని ఆభరణాలు, ధన, వస్తు సంపద ఉన్నట్లు విన్న విషయాలు జ్ఞప్తికి తెచ్చుకొంటున్నారు. [illegible]

## ★ ఘంటారావం ★

అనేది ఒక మిషమాత్రమే. వారందరిదృష్టి నిజంగా చర్చిలోని ఘంటపైనే ఉంది.

ఉన్నట్లుండి దూలం పట్టుకున్న వారిలో కొందరు కెవ్వున అరిచారు. దూలం దభేలున నేలపై పడిపోయింది. అందరూ భయభీతులై చూశారు. రెండు తూములలోనుంచి కరగిన సీసం రెండు ధారలుగా బికారుల గుంపుపైన పడుతోంది. కొందరు సీసం శరీరంపైనపడి స్మృతితప్పి పడిపోయారు. కొంద రప్పుడే ప్రాణాలు విడిచారు. మిగిలినవారు ప్రక్కలకు తప్పుకున్నారు. అప్పుడక్కడ రోదనధ్వనులు, మూలుగులు ఘోరమై వ్యాపించాయి. అందరూ చర్చి గుమ్మందాటి ఇవతలకు పారిపోయి వచ్చేశారు. కళ్లెత్తి పైకి చూశారు. నూటఅరవై అడుగుల ఎత్తున శిల్పాల మధ్య మంట రేగుతోంది. మంటపైన నెరుసులు గాలిలో ఎగురుతున్నాయి. మంటకు దిగువగా రెండు వికృతాకారంలో ఉన్న తూములలోనుంచి వెండివలె తళతళ మెరుస్తున్న ద్రవం ధారగా జారుతోంది. ధారలు మెట్లవద్దపడి బరువుగా మెల్లిగా చుట్టుప్రక్కలకు ప్రవహిస్తోంది. మంటవెలుగులు గోపురంపైన పడుతున్నాయి. ఆ రాత్రివేళ ఆ దృశ్యంచూసి బికారులు భీతావహులైనారు. చర్చిలోని భయంకరాకృతులలోనున్న శిల్పాలు ప్రాణంపోసుకుని నిప్పులు కక్కుతున్నట్లున్నాయి.

బికారుల మూకల్లో ఒక్కరినోట మాటలేదు. నాయకులు మాత్రం దూరంగా ఒకచోటచేరి సంప్రదింపు లారంభించారు. క్లోపిన్ క్రోధం పట్టలేక పిడికిళు బిగించి పళ్లు పటపట కొరికాడు. "చర్చిలోపలికి వెళ్ళడం కష్టం" అని మూలిగాడు.

"చర్చిని సైతాన్ ఆవహించాడు"

"అడుగో అక్కడ చూడండి, అక్కడ తచ్చాడుతున్న రాక్షసుణ్ని చూడండి."

"అరె! వాడు క్వాసిమోడో. ఒంటికన్ను రాక్షసుడు."

"కాదు కోటదేవుడు. ఒక్కొక్కప్పుడు సిపాయి దుస్తులు ధరించి సింహంతలకాయతో తిరుగుతాడు. వాడు మనుషుల్ని రాళ్లుగానూ, రాళ్లని మనుషులుగానూ మృగాలుగానూ మార్చేస్తాడు. మనుషుల్ని రాళ్లుగామార్చి గోపురాలు కడతాడు" ఇలా బికారుల మధ్య సంభాషణ సాగుతోంది.

"అయితే ఇప్పుడేం చెయ్యడం?" అన్నాడు జిప్సీరాజు.

"ఏదో చెయ్యాలి, లేకపోతే పిరికిపందల్లా పారిపోతామా? మన సోదరిని అలా విడిచిపెట్టి పోవడమేనా?" అన్నాడు క్లోపిన్.

"విడిచిపెట్టితే ఆమెని రేపు కుక్కలాగ ఉరితీసి పారేస్తారు."

"చర్చిలో బళ్లకొద్దీ బంగారం ఉందిట" అన్నాడొకడు.

"ఏమో! అక్కడికి వెళ్ళడం కష్టం"

"ఎందుకు వెళ్లలేమో చూడాలి. రండి నావెంట ధైర్యం ఉన్నవాళ్ళు" అని క్లోపిన్ దారితీశాడు. తరవాత వెనక్కి తిరిగి "జెహాన్ ఏడీ?" అని అడిగాడు.

"చచ్చిపోయుంటాడు" అన్నాడొకడు.

"పాపం! గ్రింగైర్ ఎక్కడ?"

"మనం ఇక్కడికి రాకముందే మధ్యలో జారుకున్నాడు."

"పిరికిపంద" అని క్లోపిన్ అరిచాడు. "ముందు రెచ్చగొట్టి ఇప్పుడు తప్పుకున్నాడు."

"అడుగో జెహాన్. ఏదోలాక్కువస్తున్నాడు" అన్నాడొకడు.

జెహాన్ ఒక నిచ్చెన లాక్కువచ్చాడు. అతడు ధరించిన కవచం పెద్ద రణగుణధ్వని చేస్తోంది. "రండి రండి" అంటూ చర్చి గుమ్మంవైపుకు దారితీశాడు.

"ఏమిటది? నిచ్చెనెందుకు?"

"ఇది చర్చి వెనకవైపునుంది ఇప్పుడే జ్ఞాపకంవచ్చింది."

"ఎందుకిది?"

జెహాన్ హేళన భావంతో చూశాడు. తలెగరేశాడు. తలకి కట్టిన ఇనపముక్కలు గలగలమన్నాయి.

"ఎందుకా? అదుగో అటుచూడు" అని చెయ్యెత్తి పైన శిల్పాలవంక చూపాడు. "ఈ నిచ్చెనవేసి అక్కడికెక్కుతాను. ఆవెనకతలుపు ఈవైపుకి గడియవేసి ఉంటుంది. అది తీశామంటే చర్చిలో అన్ని గుమ్మాలూ తెరిచెయ్యవచ్చు. ధైర్యం ఉంటే నా వెనకరా"

"నీవెనక నేను రావడమేమిటి?"

"మానెయ్యి. నేనెక్కుతాను."

నిచ్చెన గోడకి వెయ్యబడింది. జెహాన్ ఒకచేత్తో నిచ్చెన పట్టుకుంటూ ఇంకోచేత్తో ఇనపముక్కలు సర్దుకుంటూ మెల్లిగా నిచ్చెనెక్కాడు. అతని వెనకనే కొందరు బికారులు నిచ్చెనపైకెగబాకారు.

జెహాన్ ఒకశిల్పం ఆధారంగా మేడమీదికివెళ్లి నిలబడ్డాడు. బికారులు ఉత్సాహంతో హాలికేకలు పెట్టారు. జెహాన్ కూడా హుషారుగా చెయ్యెగరేసి కేకపెట్టాడు. కాని వెనక్కి తిరిగీ తిరగ్గానే కొయ్యబారిపోయాడు. క్వాసిమోడో గోపురం మీదనుంచి ఎప్పుడు దిగివచ్చాడో తెలియదు, నిచ్చెనపైన ఒక శిల్పంవెనుక పొంచి కూచున్నాడు. జెహాన్ని చూడగానే తటాలున లేచి నిలబడ్డాడు. అతడి ఒక్క కన్నూ నిప్పులా కణకణలాడుతోంది. జెహాన్ రెండు చేతులూ గట్టిగా ఒక చేత్తో పట్టుకున్నాడు. అలా పట్టుకునే ముందుకి వంగి రెండో చేత్తో నిచ్చెన పట్టుకుని ముందుకి బలంగా గెంటేశాడు. నిచ్చెనతోసహా నిచ్చెనపైనున్న బికారులందరూ హాహోమంటూ కూలిపోయారు. పైన జెహాన్ ఒంటరిగా మిగిలిపోయాడు. క్వాసిమోడో కిందికి చూస్తున్న తరుణంలో జెహాన్ చేతులు విడిపించుకుని వెనుకద్వారంవైపు పరుగెత్తాడు. క్వాసిమోడో చరున వెనక్కి తిరిగాడు. జెహాన్ ఒక ఈటె తీసి విసిరాడు. అది క్వాసిమోడో జబ్బకు గుచ్చుకుంది. ఈటె బలంగా లాగివేశాడు క్వాసిమోడో. రక్తం జరజర ప్రవహించింది జెహాన్ రెండో ఈటె అందుకునేలోపలే క్వాసిమోడో లంఘించి అతణ్ని పట్టుకున్నాడు. ఎడం చేత్తో జెహాన్ రెండు చేతులూ పట్టుకున్నాడు. కుడిచేత్తో అతడి ఒంటిపైనున్న ఇనపముక్కలు వొలిచేశాడు. కత్తులు, ఈటెలు అన్నిటినీ వొలిచి నేలపైన కుప్పగా పోశాడు.

జెహాన్ పెనగులాడాడు కాని క్వాసిమోడో పట్టునుంచి తప్పించుకోడం సాధ్యంకాలేదు. జెహాన్ కాళ్ళు రెండూ కుడిచేత్తో పట్టుకుని క్వాసిమోడో పైకెత్తాడు. గబగబ మిద్దెమీదికి వెళ్ళాడు. తరవాత చేతులు విడిచిపెట్టి, కాళ్ళు రెండూ పట్టుకుని ఒడిసెలతిప్పినట్లు గిరగిర తిప్పాడు.

చీకటిలో ఎక్కడో దూరంగా ఘోరమైన ఆర్తనాదం వినవచ్చింది. అంతలోనే ఎక్కడో కొబ్బరికాయ బ్రద్దలైనట్లు వినపడింది. ఏదో గోడకుతగిలి క్రిందికి రాలిపడింది. కాని అది నేలమీద పడలేదు. మధ్య కట్టడంలో ఎక్కడో చిక్కుకుంది. జెహాన్ ప్రాణాలు అంతరించాయి.

బికారులు రోషంతో అరిచారు. "పదండి. చర్చి పడగొట్టండి" అన్నారు పగతో. జెహాన్ చావుతో బికారులు కోపంతో ఉడికిపోయారు. చుట్టూ ఇళ్లలో దూరి నిచ్చెనలు తీసుకువచ్చారు. కాగడాలు మరికొన్ని వెలిగాయి.

క్వాసిమోడో చూశాడు. బికారులు నిచ్చెనలపైనుంచి గబగబ ఎగబ్రాకుతున్నారు. కొందరు శిల్పాలకు తాళ్లుపోసి ఎక్కుతున్నారు. క్వాసిమోడో ఏమిచేయాలో తెలియక గోపురమెక్కి బోనులో పులిమాదిరి అటుఇటు తిరగ నారంభించాడు.

[ఇంకా ఉన్నది]



# "శిథిలమయ్యె నీ సర్వం!"

లవణం

వచ్చాడోయ్ మావయ్యా
తెచ్చాడోయ్ వింత లెన్నో
తిరిగి తిరిగి దేశాలను
తీయని కతలల్లి చెప్ప॥—
ఎడారిలో ఏగుతుంటె
ఎత్తు దిబ్బపైన రెండు
రాతికాళ్ళు చూచినాడు
... ... ... ...॥—

దిబ్బకు దిగువను అటు నిటు
అబ్బుర మతిభయము చెంది
పగిలిన తల మరి మొండెము
పడియుండుట చూచినాడు॥—
రాతిముఖమునందు మామ
రౌద్రం క్రౌర్యం గర్వం
విక్రమంబు చూచి తలచె
చక్రవర్తి ప్రతిమయంచు॥—

కౌతుకమున మామ అంత
కనుగొనదల చతని వింత
దుమ్ముకొట్టి పాడుబడిన
దిమ్మ తుడిచి చూచి చదివె॥—
రాజులకును రారాజని
ఒజమాండిస్ నామంబడి
అరివీరుల పీచ మడచి
నట్టె వీరచరితుండని॥—

ఏలియుండు నతడు చాల
ఎన్నికైన దేశాలను
చేసియుండు నతడు ఎన్నొ
చెప్పలేని యుద్ధాలను॥—

నేటి కతని పాదాలును
నిలిచియుండె దిబ్బపైన
తలయు మొండె మతనిదయ్యొ
ధరణిపైన ఒరిగియుండె॥—

అంత దేశమేలి తాను
అన్ని యుద్ధములును చేసి
కడకు శిల్పఖండములలొ
కానుపించు తీరుగాంచి॥—

మామ తలచె
మరిమరి యిటు
ఏదయ్యా! నీ ఘనత!
ఏదయ్యా!! నీ గర్వం!!

ఈరోజున నీ సర్వం
ఇసుక యెడారులమయం॥—
నీదు రూపశేషంబులు
నిలిచి తెలుపు ఈరోజున
శిలామయం నీ గర్వం
శిథిలమయ్యె నీ సర్వం॥—

[ఆంగ్ల మహాకవి షెల్లీని అనుసరించి]



# పాపాల భైరవుని పశ్చాత్తాపము..

ఏకప్పు దినదినానికీ చెదలుబట్టి దివికి రాలిపోతున్న పూరి గుడిసెలో, ఏపూటకాపూట గంజి కోసం ఇతరుల్ని ఆశ్రయిస్తూ కాలం గడుపుతున్న నిరుపేద దంపతులకు ఒక మగబిడ్డ పుట్టాడు. "కూలివాడికి కూడా మగబిడ్డా!" అని విస్తుపోయింది ఊరంతా.

ఆ పేదవాడు భార్యతో అన్నాడు: "మనమే ఈ కరువు కాలంలో గంజి దొరక్క అఘోరిస్తున్నాంకదా! ఇక ఈ బిడ్డను సాకడం ఎలాగ? ఎవరైనా కోరినట్టయితే పెంపకానికి ఇచ్చేద్దామా?"

సరేనంది అతడిభార్య. దేహములో కండ అన్నమాట లేక పట్టి ఎముకలగూడుగా మిగిలి, బిడ్డకు వేళకింత పాలైనా ఇవ్వలేని దురవస్థలో వున్న ఆయిల్లాలు అంతకన్నా మరేం చెప్పగలదు!

కోళ్లు కొక్కొరకో అని ప్రపంచాన్ని లేపుతున్నప్పుడు ఆ పేదవాడు బిడ్డను భుజాన వేసుకుని ఊరు విడిచి దగ్గర్లోవున్న పట్నంవైపు నడకసాగించాడు. అతనికి మార్గమధ్యంలో ఒక పెద్దమనిషి ఎదురయ్యాడు.

"ఇంత కసిగందునెత్తుకుని ఎక్కడికి పోతున్నావయ్యా! పాపం. బిడ్డ అప్పుడే సొమ్మసిల్లిపోయినట్టున్నాడే" అన్నాడా పెద్దమనిషి.

"ఇప్పుడు నాకంఠ్లకు పండుగ కలగజేయడానికీ, వార్ధక్యంలో నన్ను సాకి సంతరించడానికీ, మరణానంతరం నాకు కర్మక్రియలు యధావిధిగా జరిపించడానికీ భగవంతుడు నాకీ బిడ్డను ప్రసాదించాడు. కానీ నేను పేదవాణ్ణి. బిడ్డను సాకలేను. ఏపుణ్యాత్ముడికైనా పెంపకానికి ఇచ్చేద్దామని వెళ్లుతున్నాను" అన్నాడు నిరుపేద.

"ఎవరికో ఇవ్వాడమెందుకు? నేనే ఆబిడ్డకు పెంపుడుతండ్రిగా వుంటాను. కానీ నేను దేశద్రిమ్మరిని. ఒకచోట వుండను. బిడ్డను

మూలం: లియో టాల్‌స్టాయ్ ★ మధురాంతకం రాజారాం

నీదగ్గరే వుంచుకో. వాడిని పోషించడానికి కావలసిన డబ్బును నేను పంపిస్తూవుంటాను." అన్నాడా పెద్ద మనిషి.

పేదవాడు ఆనందాశ్రువుల్ని తుడుచుకుంటూ "నేను తమకు కలకాలమూ కృతజ్ఞుణ్ణినై వుంటాను" అన్నాడు.

పెద్దమనిషి ఒక డబ్బుసంచిని పేదవాడికిచ్చి "ఇదైపోకముందే మళ్లీ నీకు డబ్బు పంపిస్తాను. బిడ్డను జాగ్రత్తగా పెంచు"అని తిన దారిన తను వెళ్లిపోయాడు.

## 2

పేదవాడు తన కుమారునికి నాగులు అని పేరుపెట్టాడు. పెంపకానికి పెద్దమనిషి పంపిస్తున్న డబ్బును స్వంత ఖర్చులకెంతమాత్రమూ వినియోగించక నాగుల్ని పెంచి పెద్దజేశాడు.

నాగులు చదువుకున్నాడు. చదువుల్లోన్నిసారం తెలుసుకున్నాడు. ఒకనాడతడు చదువుతూ, చదువుతూ వుండిన భాగవతాన్ని మూసిపెట్టి, పద్యాల్ని వింటూవున్న తల్లిదండ్రులతో ఇలాఅన్నాడు: "మీ రిద్దరూ చింకిపేలికలు కట్టుకుంటున్నారు. కూలీనాలీ చేస్తూ గంజి త్రాగి బ్రతుకుతున్నారు' మరి నన్ను మాత్రం ఒకయువరాజునులా పెంచుతున్నారు. ఇక మీదట, ఇలా చేశారంటే నే నొప్పుకోను. మీలాగే నేనుకూడా చింకిపేలికలే కట్టుకుని గంజి త్రాగుతాను."

పేదవాడు నవ్వి "ఒరేబాబూ! నువ్వు పేరుకుమాత్రమే. మాకొడుకువి. మేము నిన్నుకన్నామంతే. పెంచిన పుణ్యాత్ము డింకొకడున్నాడు. ఐతే ఆయన ఎక్కడుంటాడో మాకు తెలియదు. కానీ విచిత్రంగా ఎవరివద్దనైనా నీపెంపకానికి డబ్బు పంపిస్తూ వున్నాడు" అన్నాడు.



ఆ నిలువుటద్దం లో సమస్త విశ్వమూ ప్రత్యక్షమయింది నాగులుకు.

ఐతే నేనాయన్నొకసారి చూడాలి" అన్నాడు నాగులు. తండ్రి అతనికి పెద్దమనిషియొక్క ఆనవాళ్లన్నీ చెప్పాడు. తల్లిగుడ్డలో చద్దన్నం మూటగట్టి ఇచ్చింది. నాగులు తల్లిదండ్రులకు నమస్కరించి వాళ్ల దీవెనల్నందుకుని తన పెంపుడుతండ్రిని చూచి రావడానికి బయల్దేరాడు.

ఊరి పొలిమేరదాటుకునిరస్తాలో రెండుక్రోసులు నడచిన తర్వాత నాగులు ప్రయాణశ్రమచేత అలసిపోయి ఒక వేపచెట్టు క్రింద కూచున్నాడ. అప్పుడు రస్తా వెంబడి ఎక్కడికో వెళ్తున్న పాంథుడొకడు నాగుల్ని చూచి "ఎక్కడికి

# పాపాల భైరవుని పశ్చాత్తాపము

వెళ్తున్నావబ్బాయీ?" అని అడిగాడు. నాగులు తన పెంపుడు తండ్రి వృత్తాంతాన్ని అతనికి చెప్పాడు.

అంతా సావధానంగా విని ఆ పెద్దమనిషి మెల్లగా నవ్వి "నాగులూ! నేనే నీ పెంపుడు తండ్రిని" అన్నాడు.

నాగులు ఒకక్షణంపాటు విస్మయంతో అతణ్ణి తేరిపారజూచాడు. తరువాత సాష్టాంగపడి అతనిపాదాలకు నమస్కరించి "నాన్నగారూ! ఇప్పుడు మీ రెక్కడికి పోతున్నారు? మా ఇంటికి వెళ్దాంరండీ. రావడానికి మీ కిప్పుడు తీరిక లేకపోతేనే మీతో కూడా వస్తాను. నన్ను మీ ఇంటికి తీసుకవెళ్ళండి" అన్నాడు.

"నేనిప్పుడొక పనిమీద వెళ్తున్నాను నాగులూ! పోదలచుకున్నట్టయితే నువ్వు నా యింటికి వెళ్లు. దారిచెబుతావిను. ఆ రెండుకొండల మధ్య సన్నని కాలిబాటవుంది. ఆ బాటవెంబడీ వెళ్లు. అక్కడొక అరణ్యం వుంది. దాన్ని అధిగమించు. అక్కడ పాపఘ్ని అనే నది ప్రవహిస్తూ వుంటుంది. ఆ నది గట్టున వుంది నాయిల్లు. నువ్వు ఆ భవనంలో యధేచ్ఛగా విహరించవచ్చు. కానీ ఒక హెచ్చరిక సుమా! ఏ గది తలుపైతే మూయబడివుంటుందో ఆ గదిలో ప్రవేశించకూడదు నువ్వు! ఇక వెళ్లు" అని ఆ పెద్దమనిషి మళ్లీ రస్తా వెంబడి ముందుకు సాగిపోయాడు.

నాగులు కొండలమధ్య వున్న కాలిబాటను చేరుకుని మధ్యాహ్నంవరకూ పయనించాడు. అక్కడ ఒక సెలయేటిచెంత కూచుని చద్దన్నం తిని, తర్వాత సంతోషంగా పాడుకుంటూ అడవిని దాటుకుని అవతలికి వెళ్లాడు. హోరుమని శబ్దిస్తూ పాపఘ్ని ప్రవహిస్తుండడం చూచాడు. నదిగట్టున వున్న మహాసౌధాన్ని తిలకించి, దాని నిర్మాణరామణీయకతకు వెరగుపడ్డాడు.

ఆసౌధంలో నాగులకు ఎవరూ కనపడలేదు. బంగరువళ్లెరాల్లో తినుబండారాలు కావలసినన్ని కనిపించాయి. అతడును కొన్నిటిని రుచిచూస్తూ, భవనమంతా కలయతిరిగి కడపట నాలుగో అంతస్థున ఒకగది గుమ్మంముందుకువచ్చి ఆగాడు.

ఆగది తలుపుమూయబడివుంది. కానీ తాళంమాత్రం లేదు తలుపు తెరచి లోపల ఎలాటివస్తువులున్నాయో చూద్దామనుకున్నాడతడు. ఆగదిలోనికి వెళ్లకూడదని తన పెంపుడుతండ్రి చెప్పినమాట అతనికి జ్ఞాపకం వచ్చింది కానీ లోపలికి వెళ్లాలనే ఉత్కంఠని అతడాపుకోలేకపోయాడు.

తలుపును రెండుచేతులతో త్రోసి గదిలో ప్రవేశించినతర్వాత అక్కడ నాగులకు మరేమంత వింతవస్తువులు కనిపించలేదు. నిజానికి ఒక నిలువుటద్దము, రెండుమూడు వాడి ఖడ్గాలుతప్ప మరేం వస్తువులు అక్కడలేవు. నాగులు అద్దంముందు నిలుచున్నాడు. కానీ అతనికి తన ప్రతిబింబం కనపడలేదు. జానెడంతలేని చిన్నికృష్ణునినోట్లో సర్వప్రపంచమూ కనబడినట్లు, ఆనిలువుటద్దంలో కూడా సమస్తవిశ్వమూ ప్రత్యక్షమయింది నాగులకు!

ఆకాశాన్ని చుంబించే పర్వతాలొకవైపు, తరంగసంక్షుభితాలైన సముద్రాలు మరొకవైపు, కనుపించాయి నాగులకు! చూడగా చూడగా అతనికి తను పుట్టిపెరిగిన గ్రామంకూడా దృగ్గోచరమైంది. ఆగ్రామంచెంత కొండవాగుకు ప్రక్కన తనతండ్రి కౌలుకు సాగుచేస్తున్న పొలంలో పండి, వంగిన జొన్నపైరు కూడా అతనికి కనులవిందుగా కనిపించింది. ఆ పైర్లో ఎవరో కంకుల్ని కోస్తున్నారు. అతడు పరకాయించి చూచాడు. ఆవ్యక్తి తన తండ్రికాదు. ఎవడో దొంగ! ఎవరూ లేకపోవడం చూచి జొన్నకంకుల్ని కోసి సంచిలో పోసుకుంటున్నాడు. "కష్టంమాది, ఫలితం వాడికా?" అనుకుంటూ పండ్లుకొరికాడు నాగులు. ఏం చేయడానికీ అతనికి పాలుపోలేదు. దిక్కులుతోచక "నాన్నా! దొంగపడ్డాడు చేన్లో" అని అరిచాడు.

ఎక్కడో కొన్నిక్రోసుల దూరంలో వున్న పల్లెటూళ్లో తన గుడిసెలో పడుకుని నిద్రిస్తున్న నాగులు తండ్రి ధిగ్గున మేల్కొన్నాడు! భార్యనులేపి "మనచేన్లో దొంగలు పడ్డట్టు కలవచ్చింది. వెళ్తున్నా" అంటూ, వడివడిగా పొలానికి వెళ్లాడు. కంకులసంచిని తలమీద వుంచుకుని పారిపోతున్న దొంగని పట్టుకున్నాడు. ఈలోపల ఆలోపల

వాగిస్తూ వాణ్ణి ఊళ్లోకి లాక్కొచ్చాడు.

“వెధవకి సరైన శాస్తి జరిగింది” అనుకున్నాడు నాగులు!

తర్వాత తన తల్లి ఏం చేస్తూ వుందోనని మళ్లీ తమ గుడిసెవైపు దృష్టి నిగుడించాడు నాగులు. అక్కడ మరో దుర్ణయం జరుగుతోంది. అతనితల్లి నిద్రిస్తుండగా ఎవడో దొంగ ఇంట్లో ప్రవేశించాడు. మెల్లగా దొంతుల్ని దించాడు. ఒకకుండ జారి క్రింద పడింది. అలికిడివిని నాగులుతల్లి మేల్కొంది. దొంగను చూచి అరవబోయింది. ఆ దొంగ తన చేతికి దొరకిన గొడ్డలినితీసి ఆమెపైకి విసరబోయాడు.

నాగులు కోపంవల్ల తన్నుతానే మరిచిపోయి, గదిలోవున్న ఖడ్గాన్ని తీసుకుని దొంగపైకి విసిరాడు. అది సూటిగా వెళ్లి దొంగతలపైన పడింది. అతడు క్రిందబడి విలవిల తన్నుకుంటూ ప్రాణాల్ని గోల్పోయాడు.

“చావరా దుర్మార్గుడా!” అంటూ నాగులు విరగబడి నవ్వాడు. అతడు నవ్వుతూండగానే ఎవరో వస్తున్న పదధ్వని వినిపించింది. ద్వారంవైపు చూచాడు. అక్కడ అతని పెంపుడుతండ్రి నిలబడివున్నాడు.

“నాగులూ! నువ్వు నా ఆజ్ఞని ఖాతర్ చేయలేదు” అన్నాడతడు. నాగులు తలవంచుకున్నాడు.

“ఈ గదిలోనికి రావడం నువ్వు చేసిన మొదటితప్పు. వచ్చి, అంతటితో ఊరుకోలేదు. ప్రపంచంలో జరుగుతున్న దుర్ణయాలలో కొన్నింటికి అడ్డు తగిలావు. నీకా అధికారమెవరిచ్చారు? నువ్విప్పుడు నీ వైరును, నీవారిని కాపాడుకున్నట్టు భావిస్తున్నావేమో! అది నీ చిత్తభ్రమ మాత్రమే. ఇందువల్ల ఏర్పడగల దుష్ఫలితాలను చెబుతా విను. మీ నాన్నచేత దెబ్బలుతిన్న కంకులదొంగ మీ కుటుంబాన్ని నాశనంచేయా లనుకుంటున్నాడు. రేపు రాత్రి మీ గుడిసె కతడు నిప్పంటించబోతాడు” అన్నాడు గృహాధిపతి.

“అయ్యయ్యో, ఆ గుడిసె కూడా లేకపోతే మే మెక్కడ వుండాలి” అని నాగులు విలపించబోయాడు.

“పిచ్చివాడా! ఏడవకు. మరొక్క విషయం విను. నువ్వే దొంగనైతే ఇప్పుడు చంపేశావో, వాడింతకు ముందు తొమ్మిది నిండు ప్రాణాల్ని తీసిన ఘోరహంతకుడు! వాడు బ్రతికివుండినట్టయితే తను చేసిన పాపాలకు ప్రతిఫలాన్ని ప్రపంచంలోనే అనుభవించి వుండేవాడు. కానీ నువ్వు వాణ్ణి ఒక క్షణంలో చంపేశావు. వాణ్ణి చంపడం మూలంగా వాడి పాపాల నన్నింటినీ నీపైకి కూలదోసుకున్నావు. ఈ గదిలోకి రాకముందు నువ్వు నిజంగా సచ్ఛీలుడివి. కానీ ఇప్పుడు పాపాత్ముడివి. నీకు ముప్పై ఏండ్లు గడువిస్తున్నాను. ప్రపంచంలోనికి వెళ్ళు. సత్కార్యాల్ని చేసి నీ పాపాల్ని పరిహారించుకో. లేకుంటే ఆ హంతకుడు తన నేరాల కన్నింటికీ అనుభవించవలసిన శిక్షను నువ్వు భరించవలసివుంటుంది.”

## 3

స్వగ్రామాభిముఖుడై తిరిగి వస్తూ నాగులు బాహుదానదితీరాన ఒక ఋష్యాశ్రమాన్ని చూచాడు. మహాత్ముల దర్శనం పాపక్షయకారకమని తెలిసినవాడు గనుక ఆయనను సందర్శించి సభక్తికంగా నమస్కరించాడు.

“ఎవరు నాయనా నువ్వు?” అన్నాడా సన్యాసి.

“నే నొక పాపిని స్వామీ! ఇంకొకడి పాపాల్ని నాతలపైన

# పాపాల భైరవుని పశ్చాత్తాపము

చేసుకుని వాటిని పరిహరించుకోడ మెలాగో తెలియక అలమటించి పోతున్న అభాగ్యుణ్ణి" అన్నాడు నాగులు.

సన్యాసి నాగులు వృత్తాంతాన్ని విశదంగా వినగోరాడు. నాగులు తన కథని ఆయనకు వినిపించాడు.

సావధానంగా విన్న తర్వాత "అబ్బాయీ! నువ్వు అన్యాయాన్ని అన్యాయంతోనే ఎదుర్కొన్నావు" అంటూ ప్రారంభించాడు సన్యాసి. "నువ్వొక మానవుడివి. ఇంకొక మానవుణ్ణి ఏ పరిస్థితిలోనైనా సరే బాధించడానికిగానీ, శిక్షించడానికి గానీ నీకు అధికారం లేదు. నీ చేతనయితే దుష్కార్యాల్ని చేస్తున్నవాడిని సన్మార్గంలో ప్రవేశపెట్టు. హింసను అహింసతో, అసత్యాన్ని సత్యంతో ఎదిరించు. భగవంతుడిని గురించి ప్రార్థనలు చేయడంకంటే మానవులకు సేవచేయడం ఉత్తమమైన సత్కార్యం అని గుర్తించు. త్వరలో నీపాపాలు భస్మీభూతమైపోవుగాక!"

"మీ ఆదేశం ప్రకారం నడచుకుంటాను స్వామీ! నా పాపాలు ఎంతకాలంలో పరిహారమైపోగలవో సెలవిస్తారా?" అన్నాడు నాగులు.

సన్యాసి నాగుల్ని దగ్గరగావున్న ఒక కొండ దగ్గరికి పిలుచుకపోయాడు. అక్కడున్న భూమి పట్టి చవిటిపట్టి చిన్న చిన్న ముండ్ల చెట్లు సైతం అక్కడ మొలవవు. అలాంటి ప్రదేశంలో సన్యాసి నాగుల్ని మూడు గోతులు తీయమన్నాడు. తీసినతర్వాత ఆగోతుల్లో మామిడిటెంకలను పాతించి సన్యాసి ఇలా అన్నాడు: "ప్రతి రోజూ నదిదగ్గిరికి వెళ్ళు. నోటిలో నీళ్ళు పోసుకుని వచ్చి ఈ పాదుల మీద ఉమ్ము. ఎప్పుడైతే ఇక్కడ మూడు మామిడి చెట్లు ఏపుగా పెరిగి పువ్వులతో పిందెలతో నిండు శోభను వెలార్చగలవో, అప్పటికి నీ పాపాలు పూర్తిగా క్షయమైపోయినట్టు నిర్ధరించుకో."

మరునాడు నాగులు మధ్యాహ్నంవరకూ నదినుంచీ నీటిని తీసుకుపోయి పాదుల్ని తడిపాడు. అప్పుడతనికి ఆకలివేసింది. సన్యాసి నడిగి పట్టెడన్నం తీసుకోవచ్చునని ఆశ్రమానికి వెళ్లాడు. తలుపు తెరువగానే కృష్ణాజినంపైన పడివున్న సన్యాసి శవం కనిపించిందతనికి!

నాగులు ఆశ్రమంముందు చితిని పేర్చాడు. సన్యాసి కళేబరాన్ని తెచ్చి చితిపైన వుంచాడు. నిప్పు ముట్టించబోతుండగా చుట్టుపట్ల గ్రామస్థులు కొందరు మామూలు ప్రకారం తట్టల్లో అన్నం వుంచుకుని అక్కడికి వచ్చారు. వాళ్ళందరూ సన్యాసికి దహనక్రియలు జరిపించి, ఆనాటినుంచీ నాగుల్ని ఆశ్రమంలో వుండిపొమ్మన్నారు.

ఆశ్రమంలో వున్న నాగులకు వంతుల ప్రకారం గ్రామస్థులు పండ్లు, ఫలహారాలు తెచ్చి సమ

ర్పించుకునేవారు. కొందరు ధనవంతులతణ్ణి అణిమాద్యష్టసిద్ధులు గలిగిన సిద్ధుణ్ణిగా భావించి అతడి అనుగ్రహంకోసం అమూల్యాలైన కానుకలు తెచ్చేవారు. కానీ నాగులు వాటిని స్పర్శించేవాడు కూడా కాదు. బీదవాళ్ళ నెత్తుక పొమ్మనేవాడు.

నాగులు ఆశ్రమవాసిగా మారి రెండేళ్ళు గడిచింది. రెండేళ్ళ పొడుగునా ప్రతిరోజూ నదినుంచీ కొండ దగ్గరికి తిరుగుతూ పాదుల్ని నీళ్ళతో తడుపుతూనే వున్నాడు. కానీ మూడు పాదుల్లో ఒక దానిలోనుంచైనా మొలక బయటికి రాలేదు.

ఒకరోజు సాయంకాలం నాగులు ఆశ్రమం ముంగిట కూచుని వుండి, అశ్వారూఢుడై పదాలు పాడుకుంటూ ఎక్కడికో పోతున్న ఒక యువకుణ్ణి చూచాడు. చీకటి పడబోతుండగా అడవిదారిని ఒంటరిగా వెళ్తున్న అతణ్ణి "ఎవరు నాయనా నువ్వు? రాత్రి కిక్కడ విశ్రమించి తెల్లవారి వెళ్దువుగానీ రా" అని పిలచాడు.

అశ్వారూఢుడు వికటంగా నవ్వాడు. నవ్వి "పిచ్చి సన్యాసీ! నే నెవడినో తెలిస్తే నువ్వు నాకు ఆశ్రయమివ్వవు. బహుశా నువ్వు నా పేరు వినేవుంటావు. నేను భైరవుణ్ణి! నా ఖడ్గదేవత చవిచూచిన మానవరక్తమంతా నేలలో ఇంకిపోకుండా వుండినట్లయితే నేటికీ ప్రపంచం రక్తసంద్రంలో మునిగిపోయివుండేది. మానవుల్ని హతమార్చడమనేది నాకొక వినోదక్రీడ! వాళ్ళని చంపినకొలదీ నాకా [illegible] నందం ఎక్కువౌతుంది" అన్నాడు.

ఆదురాత్ముని మాటలు వింటూ నాగులు కంపించిపోయాడు. వాడి ముఖాన్ని చూడ్డానికైనా మనస్కరించక తలవంచుకుని ఇలా అన్నాడు: "నువ్వు ఘోరకార్యాల్ని చేస్తున్నావు. చేస్తూ ఏదో ఘనకార్యాన్ని సాధించినట్టుమురిసిపోతున్నావు. నువ్వు ప్రజల్ని మోసగించవచ్చు. దేశాన్ని పాలించేరాజును మోసగించవచ్చు. కానీ దేవుణ్ణి మోసగించలేవు: ఆయన నిన్ను శిక్షిస్తాడు."

పాపాలభైరవుడు మరీవికటంగా నవ్వి "దేవుడా! ఏడీ, ఎక్కడున్నాడు? ఓయి దద్దమ్మా! ఈరోజు దేవుడి పేరు విన్న పాపాన్ని పోగొట్టుకునేందుకు రేపు మా మూలుకన్నా ఇద్దర్ని ఎక్కువగా హతమార్చేస్తాను! నిన్నుకూడా చంపేయాలనే అనిపిస్తోంది నాకు! కానీ ఇప్పుడు కాదు, మరొకప్పుడు! జాగ్రత్తగా వుండు" అని తనదారిన తాను వెళ్లిపోయాడు. మళ్లీ ఎనిమిదేళ్ళవరకూ అతడు నాగులకు కనపడలేదు.

## 4

రానురానూ నాగులకు ఆశ్రమవాసంపైన విరక్తిపుట్టింది. "నేనాశ్రమనివాసం ప్రారంభించి పదేళ్ళయింది. కానీ నాపాపాలు నశించిపోయినట్టు నిదర్శనం కనపడలేదు. నిజానికి నేనిప్పుడేమంత మంచిపని చేస్తున్నాను? తిండికి ఇతరులమైన ఆధారపడివున్నాను. ఎవరూ ఆశ్రమానికి రాని రోజున నా వస్తువేదో దారబోయినట్టు బాధపడుతున్నాను. [illegible] మిగా వున్నట్టు కనబడినా, నిజానికి నేను పేరుప్రతిష్ఠలకోసం సన్యాసివేషంతో మహా సాధువర్తనుడిలా నటిస్తున్నాను. ఛా, ఇదేం బ్రతుకు! ఇక్కడనుంచీ పారిపోయి, మానవులకెవరికీ అందుబాటులో లేని కొండగుహాలో తలదాచుకుంటాను" అనుకున్నాడతడు.

ఈ నిశ్చయానికి వచ్చిననాటి సాయంకాలమే అతడు ఆశ్రమాన్ని త్యజించి కొండగుహకు పయనమయ్యాడు.

మార్గమధ్యంలో అతనికి తన జీవితంలో రెండవసారిగా గుఱ్ఱంపైన శరవేగంతో వస్తున్న పాపాలభైరవుడు ఎదురయ్యాడు.

నాగులు వాడితో మాట్లాడలేదు. కానీ వాడే "ఎక్కడికి ప్రయాణం?" అని అడిగాడు.

# పాపాల భైరవుని పశ్చాత్తాపము

ఆశ్రమజీవనం సరిపడక తను గిరి గహ్వారంలో నివసించబోతున్నట్టు నాగులు వాడికి చెప్పాడు.

ఈసారి భైరవుడు నవ్వలేదు. విస్మయంతో "గుహాలోవుంటే నీకు తిండి ఎలా దొరుకుతుందయ్యా? వయసుతోబాటు నీకు పిచ్చి ముదిరి పోతున్నట్టుంది" అంటూ ముందుకు సాగిపోయాడు.

నాగులకు భైరవునిలో కొంచెం మార్పు వచ్చినట్టు తోచింది. వాడు మునుపటికంటే కొంచెం సౌమ్యంగా మాట్లాడాడు. అందుచేత ఎలుగెత్తి "భైరవా! ఆగు" అంటూ నాగులు వాడిదగ్గరికి పరుగెత్తి "ఇప్పుడైనా పశ్చాత్తాపపడు. భగవంతుడు కరుణాసింధువు. నిన్ను రక్షిస్తాడు" అన్నాడు.

భైరవుడు మొలలోనుంచీ బాకును చరాలున పైకితీసి "చూచావా బాకు! ఇప్పటికి రెండుసార్లు నిన్ను క్షమించాను. మూడోసారి నువ్వీ మాట నాదగ్గ రన్నావంటే కోరి కోరి చావును కొనితెచ్చుకున్నావన్నమాటే" అంటూ వెళ్లిపోయాడు.

మరునాడు కొండదగ్గరికి వెళ్ళిన నాగులకు ఒక పాదును చీల్చుకుని బయిటికి వస్తున్న చిన్న మామిడి మొలక నేత్రపర్వంగా కనిపించింది!

## 5

నాగులు పచనం చేయబడిన ఆహారం తినడం మానేశాడు. కాయలు, పండ్లూ తింటూ బాహుదానదిలో నీళ్లు త్రాగుతూ బ్రతుకు వెళ్ళబుచ్చసాగాడు. అతడు ఎండ అని చెట్టుక్రింద కూచోలేదు. చలి అని గుహాలో దూరుకోలేదు. శీతోష్ణస్థితుల్ని పాటించడమే అతడు మరచిపోయాడు.

ఒకరోజు రాత్రి ఆకసంలో నక్షత్రాల్ని తిలకిస్తూ గుహాముఖాన కూచునివున్న అతనికి ఒక ఆర్తనాదం వినిపించింది. నిస్సహాయకరమైన పరిస్థితిలో ఏ అభాగ్యుడో వేస్తున్న గావుకేకది. నాగులు ఆ దీనారావం వచ్చిన దిక్కుకు పరుగెత్తాడు. దగ్గరికి పోను పోనూ అతని కొక పైశాచికాట్టహాసం కూడా వినిపించింది. ఆ అట్టహాసం నాగులకు సుపరిచితమైంది అది భైరవుడి నవ్వే!

భైరవుడొక యువకుణ్ణి మర్రిచెట్టు ఊడకు బంధించి లాటీతో బాదుతున్నాడు. బంధితుని శరీరంనుంచీ ధారలు ధారలుగా రక్తం స్రవిస్తోంది. నాగులు ఆ దృశ్యాన్ని చూడలేకపోయాడు. పరుగుతో భైరవుణ్ణి సమీపించి ఒక్క విసురుతో వాడి చేతిలోవున్న లాటీని లాక్కొని దాన్ని ముక్కముక్కలుగావించి దూరంగా పారేశాడు.

భైరవుడు ఆగ్రహంతో "ఒరే పాపిష్టి సన్యాసీ! వీడెంత దురాగతం చేశాడో నీకేం తెలుసు! వీడి నాన్న దాచిపెట్టిన ధనరాశి ఎక్కడుందో చెప్పమని నాలుగు రోజుల్నుంచీ అడుగుతున్నాను. చెప్పలేదు వీడు! ఇలాటివాడిని కోసినా పాపం లేదు" అన్నాడు.

"వాళ్ల నాన్న సంపాదించిన ధనం వాడిది. దానిపైన నీకేం హక్కుంది? వాడిని విడిచిపెట్టు" అన్నాడు నాగులు.

భైరవుడు తళతళ మెరుస్తున్న బాకును పైకి తీసి "ఇంకొక్క మాట నీ నోట్లోనుంచి వచ్చిందా, ఈ బాకు నీ గుండెను చీల్చుతుంది" అన్నాడు.

నాగులు హేళనగా నవ్వాడు. నవ్వి "నువ్వు నన్ను చంపగలవని నాకు భయం లేదు. నేను నీకు భయపడను. భగవంతుడి కొక్కడికి మాత్రం భయపడతాను. భైరవా! వీడిని విడిచిపెడ్తావా, లేదా?" అన్నాడు. అనడ మేమిటి, మృగరాజులా గర్జించాడు.

గడగడా వడికిపోయాడు భైరవుడు! మానవుల గొంతుకల్ని కోయడాన్ని కేవలం ఒక వినోదక్రీడగా పరిగణించే పాపాల భైరవుడు, చేతిలో ఆయుధం కాదు సరికదా, పూచికపుల్లయినా లేని ఒక సన్యాసిముందు ఎందుకు గడగడ వడికిపోయాడో? వాడికి నాగులు ముఖంలో ఏదో అలౌకికమైన తేజస్సు గోచరించింది. ఆ తేజోమూర్తికి చేతులెత్తి నమస్కరించాలనిపించిందతనికి. కాని ఉన్నట్టుండి ఒక్కసారిగా వాడు తన దురహంకారానికి స్వస్తిచెప్పలేకపోయాడు. బంధితుని కట్లను ఊడబెరికి 'వెళ్ళిపో' అని అతడుకూడా అడవిలోబడి అదృశ్యుడైపోయాడు.

ఆమరునాడు నాగులుచూచాడు — రెండవపాదులోకూడా మామిడి మొలక మొలిచి పైకివస్తోంది!

## 6

నాగులు కొండగుహాలో నివసింపసాగినతర్వాత మళ్లీ పదేళ్లు

కాలగర్భంలో కలిసిపోయాయి.

నాగులకు ఆ ఏకాంతజీవనంపైన కూడా విరక్తి కల్గింది. ఏదేళ్లు ఏకాకిగా కాలం గడపినతర్వాత అతడిలా అనుకున్నాడు "భగవంతుడు సర్వసౌఖ్యాలకు, అన్ని ఆనందాలకూ నిలయమైన ప్రపంచాన్ని సృజించి మానవులకిచ్చాడు. కానీ వాళ్లు స్పర్థలతో ప్రపంచాన్నొక రణరంగంగా, అశాంతి నిలయంగా హింసామందిరంగా మార్చేస్తున్నారు. సత్యానికీ, అహింసకీ వాళ్లు బద్ధులైతేగానీ ఈ ప్రపంచం రామరాజ్యంగా మారదు. ఈ ధర్మసిద్ధాంతాన్ని మానవులకి చెబుతాను. కొండగుహలో నిరర్థకంగా జీవిస్తూ నా బ్రతుకు నిక వ్యర్థం చేసుకోను"

ఈనిర్ణయానికి వచ్చిన నాగులు అడవినుంచీ ఈవలికి వచ్చాడు. తను చాలాకాలం నివసించిన ఆశ్రమాన్నిగూడా దాటుకుని జనపదాల్ని సమీపించాడు. ఏదో ఆలోచించుకుంటూ పరధ్యానంగా నడుస్తున్న అతనికి వెనుకనుంచీ గుఱ్ఱపుడెక్కల చప్పుడు వినిపించింది. తిరిగిచూచాడు. అశ్వారూఢుడై వస్తున్నవాడు భైరవుడు!

"ఛా, వీడితో నాకేంమాటలు?" అనుకున్నాడు నాగులు. కానీ ఆ అభిప్రాయాన్ని త్వరగా మార్చుకున్నాడు. వాడి కొక్కడికైనా జ్ఞానోదయం కలిగించలేని తను ప్రపంచాన్ని సంస్కరించడానికి బయలుదేరిపోతుండడం కేవలం అవివేకమని తోచిందతనికి. ఈ ఊహ స్ఫురించగానే అతడు భైరవుడికెదురుగా పరుగెత్తాడు.

ఎక్కడికో పోతున్న సన్యాసి వెనుదిరిగి తనవైపు వస్తుండడం చూచిన భైరవుడు గుఱ్ఱంమీదినుంచీ క్రిందికి దిగాడు. అతడు క్రిందికి దిగీ దిగకముందే నాగులు భూమిపైన మోకరిల్లి, వాడి పాదాలను గట్టిగా పట్టుకుని "భైరవా! నిన్ను నేను శాసించడంలేదు. ప్రార్థిస్తున్నాను. భగవంతుడు మనల్ని పుట్టించింది ఒకర్ని మరొకరు ఖూనీచేసుకోవడానికి కాదు. ఒకరికొకరు సహాయం చేసుకుని ప్రపంచాన్నొక నందనారామంగా మార్చుకుని హాయిగా బ్రతకడానికి! తమ్ముడూ! నీజీవితాన్ని నాశనం చేసుకోకు. నీబ్రతుకుబాటను మార్చుకో" అన్నాడు.

భైరవుడి కనుగొలకుల్లో కన్నీటిబిందువులు నిలిచినాయ్. అతడు తనకాళ్ళపైన తాను నిలవలేకపోయాడు. కుప్పకూరలా క్రిందకూలబడి నాగులు పాదాల్ని పట్టుకుని "ఆఖరుకు నేను ఓడిపోయాను. సన్యాసీ! నువ్వే జయించావు" అన్నాడు.

"అబ్బే, ఇందులో నేను జయించిందేమిటి భైరవా? నువ్వు సద్గతికి మార్గం వెదుక్కున్నట్టయితే నాకదే చాలు" అన్నాడు నాగులు.

"నిజం చెబుతున్నాను సన్యాసీ! ఇరవై ఏళ్ళకు ముందు ఏ రోజున్నయితే నిన్ను మొదటిసారిగా చూచానో అప్పటినుంచీ నీకూ, నాకూ ప్రచ్ఛన్నంగా యుద్ధం సాగుతూనే వుంది. కానీ ఆ యుద్ధంలో నే నీనాటికి పూర్తిగా పరాజితుణ్ణయిపోయాను. నువ్వు పేరుప్రతిష్ఠలకోసం ప్రాకులాడలేదు. వాటిబారినుంచీ తప్పించుకోడానికి కొండగుహలోకి వెళ్ళిపోయావు. మృత్యువుకు కూడా నువ్వు భయపడలేదు. దానికి తెగించే నా చేత హింసింపబడుతున్నవాడికి అడ్డంగా నిలిచి వాడిని వదిలిపెట్టమని నన్ను శాసించగలిగావు. నీ సత్యబలం ముందు నా పశుశక్తి తృణమైనా కాదని గుర్తించాను. ఓ ధర్మస్వరూపీ! నన్ను రక్షించు" అన్నాడు భైరవుడు.

నాగులు భైరవుణ్ణి బాహుదా నదీతీరంలోని ఆశ్రమానికి తీసుకవెళ్లాడు. అతనికి మహాత్ముల గురించీ, సత్యాహింసల్ని గురించీ బోధించాడు.

ఆమరునాడు నాగులు చూచాడు—మూడవ పాదులో కూడా మామిడి మొలక మొలిచి పైకి వస్తోంది!

ఆరోజు రాత్రి నాగులు చనిపోయాడు! భగవధ్యానంలో వున్నప్పుడు అతనిలోనుంచీ ఒక జ్యోతి ఈవలికి వచ్చి గగనంవైపు సాగిపోవడాన్ని భైరవుడు ప్రత్యక్షంగా చూచాడు!!



"మా అబ్బాయి మంచి పర్మనెంటు ఉద్యోగం సంపాదించాడండీ!"

"అలాగా. ఎందులోనో?"

"భాషాప్రయుక్త పునర్విభజనకోసం తాత్కాలిక విచారణ సంఘం అని కొత్తగా ఒకటి పెట్టారుగా. అందులోనే ఏదో వుద్యోగం ఇచ్చారు."



సోవియెట్ బాలెరినా (బాలే నర్తకి) మయా ప్లైసెట్స్కాయా.

# మద్రాసులో సోవియట్ కళాప్రదర్శనలు

జగత్ప్రసిద్ధి పొందిన సోవియెట్ బాలే నృత్య ప్రదర్శనాలను చూసే అవకాశం గత వారం మద్రాసు పౌరులకు కలిగింది. నృత్యంలోను, సంగీతంలోను సోవియెట్ కళాకారుల విశిష్టతను, ప్రత్యేకతను అనేక సంవత్సరాలుగా వింటూ, చెప్పుకుంటూ వున్న కళాభిమానులు ప్రత్యక్షంగా ఈ ప్రదర్శనాలు చూసి ఆనందించారు. ప్రజాప్రభుత్వాల ప్రోత్సాహం వల్ల లలితకళలు ఎంత అభివృద్ధి పొందుతాయో, అవి ప్రజల కెంత సన్నిహితం అవుతాయో చూపడానికి ఈ ప్రదర్శనలే నిదర్శనం.

భారతప్రభుత్వం వారి ఆహ్వానం మీద సోవియెట్ సాంస్కృతిక మండలివారు భారతదేశానికి వచ్చారు. ఢిల్లీ, బొంబాయి, కలకత్తా నగరాలలో అసంఖ్యాక ప్రేక్షకులకు తమ కళానైపుణ్యం ప్రదర్శించి, విశేష గౌరవంపొంది ఈ మండలి వారు మద్రాసు వచ్చారు. వీరి గౌరవార్థం ఈ నెల 14 వ తేదీన అడయారు, కళాక్షేత్రంలో కళా ప్రదర్శనాలు జరిగాయి. 15 వ తేదీన సాయంత్రం ట్రిప్లికేన్, కళా మండపంలో సోవియెట్ కళా ప్రదర్శనలు ప్రారంభమైనవి. మద్రాసు గవర్నరు శ్రీప్రకాశ అధ్యక్షత వహించారు నగరంలోని ప్రముఖులనేకులు వచ్చారు. కళామండపంలోని ఆవరణలో పది పన్నెండు వేలమందికి పైగా ప్రేక్షకులు సమావేశమై సోవియెట్ సాంస్కృతిక ప్రతినిధులకు బ్రహ్మాండమైన స్వాగతం చెప్పారు, సభాస్థలం కన్నుల పండువుగా, వివిధవర్ణ విద్యుద్దీప తోరణాలతో భాసించింది.

పురజనుల తరఫున శ్రీ ప్రకాశగారు సోవియెట్ ప్రతినిధులకు స్వాగతం చెప్పారు. వివిధదేశాలమధ్య సౌహార్దం పెంపొందించడానికి సాంస్కృతిక ప్రతినిధి దళాలు అత్యధికంగా తోడ్పడతాయని, లలితకళలకు సరిహద్దులు లేవని, లలితకళల భాష విశ్వజనీనమైన భాష అనీ ఆయన అన్నారు. తనకు రష్యాపట్ల గౌరవాభిమానాలున్నాయనీ, టాల్‌స్టాయ్, తుర్గెనీవ్ వంటి ప్రసిద్ధ రచయితల గ్రంథాలు తనపై ఎంతో ప్రభావం ప్రసరించాయనీ అన్నారు. లండన్‌లో ఎనాపావ్లోవా బాలే ప్రదర్శనం ఒకసారి తాను చూచాననీ, మళ్ళీ నేటికి



"మరాళ సరోవరం" అనే రష్యన్ బాలేలో మయా ప్లిసెట్స్కాయా.

## ★ మద్రాసులో

ప్రసిద్ధ రష్యన్ నర్తకుల నృత్యం చూసే అవకాశం కలిగిందనీ ఆయన చెప్పారు.

సోవియెట్ ప్రతినిధిదళ నాయకుడు నికొలాయ్ బెస్పాలోవ్ తమకు జరిగిన గౌరవానికి కృతజ్ఞత తెలిపాడు.

అనంతరం సంగీత, నృత్య కార్యక్రమం ఓల్గా కావెర్జెనీవా వయొలిన్ వాద్య గానంతో ప్రారంభమైంది. తరువాత బోల్షాయ్ థియేటర్‌కు చెందిన ప్రసిద్ధ నర్తకి మయా ప్లెసెట్‌స్కాయా, నర్తకుడు యూరీ గాఫ్‌మన్ ఇరువురూ కలిసి "డాన్‌క్విక్సొట్" బాలేనుండి ఒక దృశ్యం నాట్యం చేశారు.

స్టాలిన్ బహుమతి పొందిన మరియా మస్కొవ్లేటీనా, విక్టర్ పావ్లావ్ కలిసి "స్లో రష్యన్ డాన్స్" అతి లలితగతిలో చేశారు.

ఉజ్బెక్ రాష్ట్ర నర్తకి ముకారాం తుర్గున్ బాయీవా చేసిన నృత్యాలు ప్రేక్షకులను ముగ్ధులను చేశాయి. భూబెన్ అనే పేరుగల డప్పువాద్యం మ్రోగుతుండగా, దాన్ని అనుసరిస్తూ ఆమె "పట్టుసేత" నృత్యం చేసింది. తరువాత ఆమె ఒక భారతీయ జానపద నృత్యంకూడా చేసింది. ప్రాచ్యఖండానికి చెందిన ఉజ్బెక్ దేశపు స్త్రీ గనుక భారతీయ నృత్యపద్ధతిని అతి సులభంగా పట్టుకొని మాధుర్యం ఒలికిస్తూ నటించింది.

నృత్యాల్లో అన్నిటికన్నా చెప్పుకో దగినది మయా ప్లెసెట్ స్కాయా చేసిన "హంస" నాట్యం. అలంకరణ రహితమైన విశాల వేదికమీద మరణావస్థలో ఉన్న హంసను అనుకరిస్తూ, తెల్లటి చేతులు రెక్కలుగా, కాలి బొటనవేళ్లమీద నిలిచి ఆకాశానికిఎగిరిపోవడానికి ప్రయత్నిస్తూ ప్లెసెట్ స్కాయా చేసిన నాట్యం మరపురానిది. ఆమె చేతులు హంస మెల్లగా తన రెక్కలల్లార్చినట్టే వంపులు తిరుగుతాయి. బొటనవేళ్ళ మీద నిలబడి ఆమె నడిస్తే హంస నడిచినట్లేఉన్నది. ఆనాట్యం కాసేపూ ఏదో సరోవరతీరాన ఉన్నట్లే అనిపించింది.

తరువాత పేర్కొనదగినవి వాలెంటినా స్కొవర్ట్‌సోవా, నికొలాయ్ సిరాయ్ కలిసి చేసిన సర్కస్‌ఫీట నృత్యం. నర్తకుడు అవలీలగా తన అరచేతిలో నర్తకిని ఆకాశంలోకి వేస్తాడు. ఉక్కులాగ కఠినమైనవారి శరీరాలు అంత చిత్రంగా మెలికలు తిరగడం అద్భుతంగా ఉన్నది.

ఈ నృత్యంతర్వాత ఇద్దరుస్త్రీలు, ఇద్దరు పురుషులు కలిసి రష్యన్ జానపద నృత్యం చేశారు. రష్యన్ దేశీయుల శరీర దార్ఢ్యం, లాఘవం, లయశీఘ్రత, శృంగారమార్దవం అన్నీ ఇందులో ప్రతిబింబిస్తాయి.

నృత్యాలనడుమ సంగీత కార్యక్రమం కూడా ఉన్నది. ఆస్వాదనకు అందినంత వరకూ సంగీతాన్నికూడా ప్రేక్షకులు సహృదయతతో ఆనందించారు. కాని నృత్యాలే ఎక్కువగా ప్రేక్షకులను అలరించాయి. అజర్‌బైజన్ గాయకుడు రషీద్ బేబుటావ్ పాడిన అజర్ బైజన్ పాటలను మాత్రం శ్రోతలు బాగా ఆనందించారు. ఈ బేబుటావ్ రెండేళ్ళక్రితం ఒక సోవియెట్ ప్రతినిధిదళంలో కలిసి ఇండియా వచ్చి, మద్రాసులో కూడా తన పాటలు వినిపించాడు.

మొత్తంమీద ఈ కార్యక్రమంయావత్తూ ప్రేక్షకులను ఆనందంలో ముంచి తేల్చింది. ★

# రష్యన్ బాలే

హరినారాయణ్ వర్మ

భారతీయ శాస్త్రీయ నాట్యము అతి సూక్ష్మమైన అంగవిక్షేపములతో, అనంతమైన భావవ్యక్తీకరణ పద్ధతులతో కూడినది కావడంచేత చాలా క్లిష్టమైనదని భావిస్తాము కాని, రష్యన్ బాలే కళ ఇంకా క్లిష్టమైనది. కొంతకాలం క్రితం కొందరు భారతీయ సినిమాతారలు రష్యన్ బాలే నేర్చుకోవడానికి గట్టి ప్రయత్నాలు చేసి, నిరాశచెందారు. శరీరమంతటినీ ఒక్క బొటనవ్రేలిమీదే నిలపగలగడం చాలా కష్టసాధ్యమైన విషయం.

### బాలే కళ

బాలే ఒకరకమైన నృత్యనాటకం. నృత్యంలో వలెనే, బాలేలో కూడా నర్తకి అవయవ చాలనానికి ప్రాధాన్యం హెచ్చు. ముఖ్యమైన తేడా ఏమంటే, బాలేలో నర్తకి శరీరమే సంగీత వాద్యాలుచేసే పని చేస్తుంది. నర్తకి తన అవయవాల కదలికల ద్వారానే లయబద్ధమైన సంగీతాన్ని కూడా సృష్టిసుంది. ఇదికాక బాలేకు కొన్ని నాటక లక్షణాలున్నాయి. దానికి చిత్ర కళాత్మకమైన సీనరీలుకూడా అవసరం.

శాస్త్రీయమైన బాలే కళలో అవయవాల కదలికలకూ, భంగిమలకూ నిర్దిష్టమైన నియమాలున్నాయి. శాస్త్రీయమైన బాలేలో వీటిని తు. చ తప్పకుండా అనుసరించి తీరాలి. పాదములకు అయిదురకాల భంగిములున్నాయి. తల, బాహువులు కూడా ఈ నృత్యంలో ప్రధాన పాత్ర వహించి నృత్యానికి పరిపూర్ణత చేకూరుస్తాయి. ఒకే బొటనవ్రేలిమీద నృత్యం చేయడం అసహజమైనప్పటికీ, కళాదృష్ట్యా దీనికి ప్రయోజన మున్నది. దీనివల్ల నర్తకి శరీరం యావత్తూ, వివిధ అవయవాలతోపాటు, సంపూర్ణమైన ఉపయోగంలోకి వస్తుంది; నర్తకి ఒకస్థలంనుండి మరొకస్థలానికి మారడానికి ఉపయోగపడుతుంది.

నాటకంలోవలెనే బాలేలోకూడా అలంకృతమైన రంగస్థలం కావాలి. ముఖ్యమైన తేడా ఏమిటంటే, బాలేలో మాటలుండవు. భాష భావవ్యక్తీకరణకు ఒక సాధనం. ఆ భాష తెలిసినవారికే అది అవగాహన అవుతుంది. బాలేనృత్యం సార్వజనీనమైన భాష. దానికి మాటలు, కాలం, దేశం అనే పరిహద్దులు లేవు. నిశ్శబ్ద శరీర చాలనములే



ఏక్రొబాటిక్ నృత్యంలో వాలెంటినా సోక్వర్ట్సోవా, నికొలాయ్ సిరాయ్.



"మరణిస్తున్న హంస" (డైయింగ్ శ్వాన్) నృత్యంలో మయా ప్లిసెట్స్కాయా.

జానిభాష. ప్రేక్షకుడు నర్తకి కదలికలను జాగ్రత్తగా గమనిస్తూ భావం గ్రహిస్తాడు.

బాలేలో అనేకమంది నృత్యకారులు పాల్గొంటారు. ముఖ్య పాత్రధారిణిని బాలెరినా అంటారు. ఆమె ప్రక్కన ఒక పురుషపాత్రధారి కూడా వుంటాడు. స్త్రీ పాత్ర చుట్టూరా కథ అల్లుకొని వుంటుంది గనుక, బాలెరినా నృత్యకౌశలంమీదనే బాలే ప్రదర్శన విజయం ఆధారపడి వుంటుంది. నృత్య శాస్త్రనియమాలను అతి కఠినంగా అనుసరించవలసి వుంటుంది. అందుచేత నృత్యం, సంగీతం, సెట్లు - ఈ మూడింటి సంయుక్త ప్రావీణ్యంవల్ల బాలే పూర్తిగా రక్తి కడుతుంది.

## రష్యన్ బాలే ఘనత

శాస్త్రీయమైన బాలేకళకు రష్యా పెట్టిన పేరు ప్రపంచమంతటా దీని ఘనత వ్యాపించినది. అధునాతన రష్యన్ బాలే కళ సనాతన దృక్పథం వదిలిపెట్టింది. బాలే నృత్యాలకు పౌరాణిక గాథలే ఆధారంగా వుండాలనే సాంప్రదాయిక వాదం వర్జించి, సామాన్య మానవజీవితం నుండి ఇతివృత్తా



ఉజ్బెక్‌స్తాన్ నర్తకి ముకారాం తుర్గున్ బాయీవా.

లను సేకరిస్తోంది. ప్రజలకష్ట సుఖాలను, వారి మధ్యగల సాంఘిక సంబంధాలను చిత్రిస్తోంది. శాస్త్రీయ బాలే కళ, జానపద నృత్యకళ కూడా క్రమంగా సమ్మిళిత మవుతున్నాయి.

నృత్యంద్వారా రూపకల్పన చేయబడే బాలే పాత్రలు, నాటకంలో కంటె, సాహిత్యంలో కంటె ఎక్కువ ప్రభావం సామాజికులపై చూపిస్తాయి. నృత్యంలోని ప్రధాన ప్రయోజనాన్ని, వివిధభావాలను మరింత విస్పష్టంగా, వివరంగా, విశ్వసనీయంగా అభివ్యక్తీకరించే పద్ధతులను సోవియెట్ నృత్య నిర్మాతలు, నర్తకులు కనుక్కొని ఆచరణలో పెడుతున్నారు. సోవియెట్ బాలేలోని పరిపూర్ణ వాస్తవికతకు ఇదే కారణం.

ఇతర బాలే విధానాలలోవున్న ప్రత్యేక గుణాలను, సౌందర్యాలను రష్యన్ బాలే జీర్ణించుకొని అభివృద్ధి పొందింది. ఫ్రెంచి బాలేలోని పదకౌశల్యం, ఇటాలియన్ బాలే

## రష్యన్ బాలే

లోని నాటకీయ భావప్రకటనం, స్కాండి నేవియన్ బాలేలోని ఉదాత్తశైలి ఇవన్నీ రష్యన్ బాలేలో సమ్మేళనం పొందుతాయి.

రష్యన్ బాలేకు శతాబ్దాలనుండీ వచ్చే సంప్రదాయం వున్నది. 1770 లో ఉర్సావ్ అనే ఆయన పెట్రోవ్స్కీ థియేటరుస్థాపించి రష్యన్ కళాభివృద్ధికి దోహదం చేశాడు. ఈ థియేటరులోని వాస్తవిక ప్రదర్శనలు ఎంతో ప్రజాదరణ చూరగొన్నాయి. దాని స్థానంలో కొత్తభవనం నిర్మితమైంది. దాని పేరే బోల్షాయ్ థియేటరు. చైకోవిస్కీ లాంటి ప్రఖ్యాత కళావేత్తలుదానికి జీవం పోసి, తమ కళను ధారపోశారు. "మరాళ సరోవరం" (స్వాన్ లేక్) అనే శాస్త్రీయమైన బాలే 1875 లో ప్రదర్శించబడింది. ఎనాపావ్లోవా బాలెరినా గా ప్రసిద్ధి కెక్కింది.

బోల్షాయ్థియేటరుకుస్వంతంగా ఒకబాలే బృందంఉన్నది. ఉలనోవా, లెపిసిన్స్తాయా, ప్లెసెట్స్కాయా (ఇప్పుడు ఇండియా వచ్చిన నర్తకి) మొదలైన ప్రసిద్ధ నర్తకీమణులీ థియేటరుకు చెందినవారే. రోమియో జూలియట్, సిండరెలా, బ్రాంజ్ హార్స్‌మన్, రెడ్ పపీ మొదలైన అద్భుత కళాఖండాలు ఈ థియేటర్ నుండి ఇటీవల వచ్చినవే. శాస్త్రీయ రష్యన్ బాలేకు "మరాళ సరోవరం", "నిద్రిత సుందరి" (స్లీపింగ్ బ్యూటీ) మొదలైనవి ప్రధాన ఉదాహరణలు.

"మరణిస్తున్న హంస" నృత్యం చేసిన మయా ప్లెసెట్స్కాయా తన బాహువులతో హంస అంతిమ గీతాలు "పాడడం" ప్రేక్షకులను సమ్మోహపరుస్తుంది. బృంద నర్తకిగా ఆమె చాలా ప్రవీణ. రష్యన్ బాలే విజయానికి ఆమె స్నిగ్ధ సౌందర్యం ఒక కొంత, ఆమె నృత్య వైదగ్ధ్యం మరి కొంత కారణం. ముఖ్యంగా గమనించదగ్గది రష్యన్ బాలేలోని వాస్తవికత. అందువల్లనే అది ప్రజాసామాన్యానికి అభిమాన పాత్రమైంది. ★

## సినిమా వార్తలు

నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి మొదటి చిత్రం "తోడుదొంగలు" మార్చినెలలో విడుదల చేస్తారని తెలుస్తున్నది. గడిచిన డిసెంబరు 12వ తేదీన ప్రారంభింపబడిన ఈ చిత్రం ఇంత త్వరగా పూర్తికావడం చాలా హర్షించదగినది. దీనికి దర్శకుడు యోగానంద్; కథ, సంభాషణలు సముద్రాల జూనియర్; సంగీతం టి. వి. రాజు; కామెరా రహమాన్; ఆర్ట్ తోట; స్టూడియో వాహిని. ఎన్. టి. రామారావు, గుమ్మడి వెంకటేశ్వరరావు, చలం, మద్దాలి కృష్ణమూర్తి, డా॥ శివరామకృష్ణయ్య, పుండరీకాక్షయ్య, హేమలత, టి. జి. కమలాదేవి, పార్వతి మున్నగువారు నటిస్తున్నారు.

నేషనల్ ఆర్ట్ థియేటర్ వారు ఇటీవల తమ రెండో చిత్రానికి ప్రారంభోత్సం చేశారు. దీనిపేరు "అల్లూరి సీతారామ రాజు." బ్రిటిష్ ప్రభుత్వాన్ని ఆంధ్రలో ఎదుర్కొని పోరాడిన సాహసికుని జీవిత చరిత్ర ఇతివృత్తం. కొలదికాలం క్రిందటనే జరిగిన యథార్థచరిత్రను చిత్రించడం అనేకమైన యిబ్బందులతో కూడుకొన్న పని అయినా సాహసించినందుకు నేషనల్ ఆర్ట్ థియేటర్ వారిని అభినందించాలి.

* * *

గోకుల్ పిక్చర్సువారి సాంఘిక చిత్రం "నిరుపేదలు" కూడా మార్చిలోనే, బహుశా మొదటివారంలో విడుదల కావచ్చునట. రీరికార్డింగు వగైరా చిల్లరపని మాత్రం మిగిలివున్నదట. కథ వ్రాసినది కె. ప్రత్యగాత్మ. సంభాషణలు, పాటలు అనిశెట్టి; సంగీతం టి. వి. రాజు; ఆర్టు ఎస్. కృష్ణరావు; స్టూడియో రేవతి; నాగేశ్వరరావు, జమున, బాలసరస్వతి, రమణారెడ్డి, సి. హెచ్. కుటుంబరావు, సుధాకరరావు మున్నగువారు నటించారు. దర్శకుడు శ్రీ తాతినేని ప్రకాశరావు. ఈ చిత్రం కూడా నవంబరులో మొదలై త్వరలో పూర్తి చేయబడిన చిత్రమే.

* * *

ఒరియా భాషలో రూపభారతి లిమిటెడ్ వారు నిర్మించిన "శ్రీ జగన్నాథ మాహాత్మ్యం" అనే చిత్రాన్ని తెలుగులో యూనియన్ పిక్చర్సువారు పునర్నిర్మిస్తారట. మద్రాసు నటీనటులతో, మద్రాసులోనే పునర్నిర్మాణం చేస్తారట. దర్శకుడు శ్రీ కొటూరి మోహన్ గారు.

* * *

భారతఫిలిం ఫెడరేషన్ అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన ఎస్. ఎస్. వాసన్ గారిని అభినందించడానికి దక్షిణ భారత ఫిలిం వాణిజ్యమండలివారు మైలాపూరు వుడ్‌లాండ్స్‌లో ఈనెల 18న సభ ఏర్పాటు చేశారు. మండలి అధ్యక్షుడు రామయ్యగారు వాసన్ గారిని అభినందిస్తూ మాట్లాడారు. వాసన్ గారు ఫెడరేషన్ అధ్యక్షుడుగా ఫిలింపరిశ్రమసమస్యలను పరిష్కరించడానికి శక్తివంచనలేక ప్రయత్నిస్తానని అన్నారు. ★

## గ్రంథ స్వీకారం

### మనుస్మృతి

గేయ నాటకం; రచయిత కనకమేడల వెంకటేశ్వరరావు; వెల 0-12-0; ప్రతులకు కె. వెంకటేశ్వరరావు, 9, రండాల్స్ రోడ్డు, మద్రాసు-7.

### శ్రీ స్వామి

భక్తిరస పద్య సంపుటి; కవి ఎం. వి ఆర్. కృష్ణశర్మ (తెలుగు పండితులు' గుంటూరు) వెల 0-6-0. ప్రతులకు మన్నవ రామారావు, పూర్ణానందంపేట, విజయవాడ-2.

### మానవుడు

రచయిత గిడుతూరి సూర్యం; అవినీతి పైన, మృత్యువుపైన మానవుని విజయం చూపించే 'పాంటోమైమ్' నాటిక. వెల 0-1-6; ప్రతులకు ప్రజాసాహిత్యపరిషత్తు, మామిళ్ళగూడెం, ఖమ్మంమెట్టు.

నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి "తోడుదొంగలు" లో రైసుమిల్లు మేనేజరుగా ఎన్. టి. రామారావు, యజమానిగా గుమ్మడి వెంకటేశ్వరరావు.



గోకుల్ పిక్చర్సు వారి "నిరుపేదలు" లో జమున, సుబ్బారావు మున్నగు వారు.





భరణీ వారి "చక్రపాణి" లో భానుమతి.

# విజ్ఞాన వీధులు

"డాక్టర్"





## 173. భూకేంద్ర సిద్ధాంతం అంటే ఏమిటి ?

చంద్రుడు, బుధుడు, శుక్రుడు, సూర్యుడు, కుజుడు, గురుడు, శని - అనే యేడు ఖగోళాలను గ్రహాలని ప్రాచీనులు భావించేవారు. మిగిలిన ఖగోళాలన్నీ నక్షత్రాలు. నక్షత్రాలెల్లపుడు సమవేగంతోనే (*Uniform Velocity*) ఆకాశంలో సంచరిస్తున్నట్లు కనపడతాయిగాని సూర్య చంద్రులుతప్ప మిగిలిన గ్రహాల వేగాలలో మాత్రం మార్పుంటుంది. ఒక్కొక్కప్పుడు తీవ్రవేగంతోనూ, వేరొకప్పుడు మంద వేగంతోనూ, ఇంకొకప్పుడు స్తంభించియును, మరొకప్పుడు విముఖదిశలోనూ సంచరిస్తున్నట్టుల అవి ప్రత్యక్షమౌతాయి. గ్రహగతులనుగూర్చి కొంతపరిజ్ఞాన మేర్పడిన పిమ్మట బ్రహ్మాండస్వరూపాన్ని ఏవిధంగా నిర్ణయిస్తే, గ్రహగతులను సులువుగా విశదీకరించుటకు అనువుగా ఉంటుందనే సమస్య శాస్త్రజ్ఞుల దృష్టిని ఆకర్షించింది. భూమిమీదనున్న మనకు భూమి స్థిరంగా నున్నట్లు దానిచుట్టు ఖగోళాలు తిరుగుచున్నట్లు అనిపిస్తుంది. ఈ దృగ్గోచర విషయాన్ని ఆధారంగా చేసికొని, స్థిరంగానున్న భూమిచుట్టు *Epicycle* ఆకారకక్ష్యలలో గ్రహాలు తిరుగుచున్నాయనే యొక సిద్ధాంతాన్ని క్రీస్తు పూర్వం 160 సంవత్సర ప్రాంతమందున్న హిపార్కస్ శాస్త్రజ్ఞుడు చేసేడు. దీనికే భూకేంద్రసిద్ధాంతమని (*Geocentric theory*) పేరు. దీన్ని క్రీ. శ. 140 సంవత్సర ప్రాంతంవాడైన టోలమీ వ్యాప్తిలోనికి తీసికొని వచ్చేడు. అందువలన టోలమీసిద్ధాంతమని కూడా దీన్ని పేర్కొంటారు.

విశ్వానికంతకీ కేంద్రస్థానంలో స్థిరంగా భూమియున్నదనే విషయం భూకేంద్ర సిద్ధాంతానిక్కి జీవగర్ర. ఇట్లు స్థిరంగానున్న భూమిచుట్టు నియమిత కక్ష్యలలో చంద్రుడు, బుధుడు, శుక్రుడు, సూర్యుడు, కుజుడు, గురుడు శనిగ్రహాలు వరుసగా పరిభ్రమిస్తున్నాయి. సూర్య, చంద్రులకక్ష్యలు వృత్తాకారంలోనూ, మిగిలిన అయిదు గ్రహాలకక్ష్యలూ *Epicycle* ఆకారంలోనూ ఉంటాయి. ఒక పెద్ద వృత్తంచుట్టు మరియొక చిన్నవృత్తంలో ఒక మూర్తి తిరుగుచున్నదనుకొంటే, ఆ మూర్తిచుట్టే త్రోవ *Epicycle* ఆకారంలో ఉంటుంది. 1వ పటాన్ని బట్టి ఆఆకారం ఎట్లుంటుందో గ్రహించవచ్చు. గ్రహకక్ష్యల కన్నింటికీ అవల నక్షత్రాలు పొదగబడి యున్నస్ఫటి



పటము 1



పటము 2

# యోగాసనములు-దేహారోగ్యము

## 5. పార్శ్వవాయువు (పక్షవాతము)

ముందు వివరించబడిన రోగములలో పార్శ్వవాయువు అనగా పక్షవాతమును గురించి ఈవ్యాసములో చర్చించుచున్నాను. పార్శ్వవాయువును నివారించుటకు యోగాంగసాధనవిధానమును చెప్పుటకు ముందు అదివచ్చుటకు కారణమేమి, అదెన్ని విధములు మొదలైన అంశములు తెలుసుకొనుటవసరము. ఈ విషయమునకు ఆధారమైన గ్రంథములేవనగా దర్శన, త్రిశిఖిబ్రాహ్మణ, శారీరక, గర్భ, శాండిల్య, కఠ, ప్రశ్నోపనిషత్తులు, హఠయోగప్రదీపికా, పాతంజలయోగదర్శనములు మొదలైనవి.

కలియుగమునందు మానవుల పొడవు వారి వారిచేతి 'అంగుళము'ల లెక్కప్రకారము 96 'అంగుళములు'. ఈ లెక్క స్త్రీ పురుషులకు సమానము. ఈ ప్రమాణము అనేక సహస్రాబ్దములు నిలిచినది. అయినగూ ఇప్పటికీ అక్కడక్కడ కొందరిలో ఈ ప్రమాణము కనపడును. కాని క్రమముగా ఆ ప్రమాణము తగ్గిపోవుటకు ముఖ్యకారణము రెండు. 1 సారహీనము అపక్వమైన ఆహారము, చెడిన ఆహారపదార్థములు సేవించుట. ఇందుకు దారిద్ర్యము, సహవాసదోషము హేతువులు. 2 ఇంద్రియనిగ్రహ లోపము.

ఎవరికి ఇంద్రియములను జయించు సామర్థ్యము కలదో, ఎవరు పుష్టికరము, సుపక్వముఅయిన ఆహారమును సేవించుచుందురో అట్టివారి దేహప్రమాణము యోగశాస్త్రములో వివరింపబడిన ప్రమాణములతో విరాజిల్లుచుండును.

శరీరమనునది విచిత్రమైన వృక్షము వంటిది. అది చక్కగా పెరిగి ఫలించుటకు తగిన ఎరువు, పురుగుబడనిది రుచికరమైనది, మితమైన సాత్వికాహారము లభించుటవసరము. మొక్కలు పెరుగుటకు సకాలములో కలుపు తీయుట, ఎరువు వేయుట నీరు పెట్టుటవంటివి యోగసాధనలు. మంచి సంతాన ఫలమును బొందుటకు కావలసిన ఓజస్సు, శుక్లశోణితములను తగురీతిని కాపాడుటకు బ్రహ్మచర్యము, పాతివ్రత్యము, సంయమములు అత్యవసరము.

### శ్రీ టి. కృష్ణమాచారి

శరీరప్రమాణ మెంతయున్నగూ శరీరమందు 96 కీళ్లు 86 నాడీగ్రంథులు, దాదాపు 72 వేలు నాడులు (సూక్ష్మనాడుల సంఖ్యకు మితిలేదు), సిరలు, ధమనులు లెక్కలేనన్ని ఉన్నవి. ఇవి మాత్రము అందరికీ సమానము. ఇవిగాక శ్వాసకోశము, అన్నకోశము, మలకోశము, మూత్రకోశము, పిత్తకోశము, పురుషులకు వీర్యకోశము, స్త్రీలకు రజఃకోశము, గర్భకోశ మున్నవి.

చక్కగా పేరుకొన్న మీగడ పెరుగును కవ్వముతో చిలికినప్పుడు వెన్న వచ్చినట్లే, శరీరమను భాండములో జీర్ణాహార సారమును యోగాంగ సాధనలను కవ్వముతో చిలికినచో ఆరోగ్యభాగ్యము, సమమైన పుష్టి ఫలించును.

ఎన్నో యోగాంగ సాధనలు ప్రచారములో నున్నవిగాని అవి మన శరీరములోని అన్ని అంగములనూ మథించలేవు. కొన్ని కుడివైపు కొన్ని ఎడమవైపు మాత్రమే చలింపజేయజాలినవి ఇట్టి సాధన అంగభంగమునకు హేతువుకాగలదు. ఫలితము ముసలితనములో తప్పక కనబడును.

శరీరములోని అన్ని భాగములను, సంధులను, గ్రంథులను ఏకకాలములో కదలించుటకు సమగ్రమైన యోగాంగ సాధన విద్య ధనుర్విద్య, మల్లవిద్య ఈ మూడేనని అనేక శాస్త్రములవలన తెలియుచున్న కాని ఈ మూడింటికి తగిన ప్రోత్సాహము లభించకుండుట విచారకరము.

మన హృదయములో 101 రక్తనాడులున్నవి. వాని శాఖోపశాఖలకు మితిలేదు. వాని మూలగ్రంథులు కూడా 101. శరీరధారణకు మూలమైన హృదయమునకు ఇవి ఆధారములు. దేహములోని భాగములలో దేనికి గాని, సూక్ష్మస్థానములకు గాని వాయు

---

కగోళం ఉంది. దీనికి *Primum Mobile* అని పేరు. నక్షత్రాలన్నీ యీ గోళంలో అమరియుండడంచేత, అవన్నీ భూమికి సమానదూరంలో నేఉంటాయి 2వ పటము భూకేంద్ర సిద్ధాంతాన్ని సూచిస్తుంది.

భూకేంద్ర సిద్ధాంతం సత్యమైనదికాదు. కాని శాస్త్రప్రపంచంలో సుమారు 1500 సంవత్సరాలు అది పరమప్రమాణంగా పరిగణింపబడింది. ఆతరువాత కోపర్నికస్, కెప్లర్, గెలీలియో, న్యూటన్ విజ్ఞానులు సూర్యకేంద్ర సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, దాని సత్యాన్ని నిరూపించడంతో భూకేంద్ర సిద్ధాంతంలోని లోపాలు వెల్లడియై, అది క్రమంగా త్రోసిరాజనబడింది. అనంత్.

# ★ యోగాసనములు - దేహారోగ్యము ★



ఏకపాద సర్వాంగాసనం

స్నుకు అనువైన రీతిని రక్త సంచారము ాయుగమనము సిరాస్రావము జరుగక ' వుట వలన లేదా నిలిచిపోవుట వలన ర్శ్వవాయువు, లేక పక్షవాతము సంభ వించుచున్నది. ఆయా శరీరభాగములు వివ శమైపోవుట సంభవించును.

ఆంగికము, ఇంద్రియకము, అఘాతజము అని పార్శ్వవాయువు మూడు విధములు.

1. ఆంగిక మనునది చేతులు కాళ్లు మొద లైన స్థూలావయవములను పడగొట్టునది.

2. ఇంద్రియక మనునది కన్ను ముక్కు మొదలగు ఇంద్రియములను వికృత మొనర్చు నది.



పర్వతాసనం

3 అఘాతజ మనగా దెబ్బ లేక శస్త్ర చికిత్సవలన ఆయాస్థానములు పడిపోవునది.

పార్శ్వవాయు నివారణకు యౌగిక చికిత్సల చేయగోరువారు ప్రప్రథమమున శరీరములోని ఈ క్రింద వివరించబడిన స్థాన ములను పరిశీలించిన తరువాత నే చికిత్స ప్రారంభించు ఒవసరము. ఈ స్థానములు పదహారింటినీ ఇదివరలో వివరించియున్న ప్పటికినీ తిరిగి వివరించుట మంచిది. 1. కాళ్ళ బొటన వ్రేళ్లు 2. మడమల గ్రంథులు 3. మోకాళ్ళు 4 తొడలు 5. రహస్యేంద్రియముల క్రిందనుండు 'సీవనీ'



ఏకపాద సర్వాంగాసనం

నాడి 6. రహస్యేంద్రియ వికారములు 7. బొడ్డు 8 హృదయము, దాని స్ఫురణము 9. కంఠము, దాని ధ్వని 10. కంఠ కూపము (గొంతు క్రిందనుండు కూపము) 11. నాలుక, దాని పలుకు, వస్నె. 12. ముక్కు ఊపిరి. 13. కనుబొమ్మల నడుమనుండు నాడీగ్రంథి. 14. ముఖము, దానివర్చస్సు. 15. తల, దానిచలన వలన ములు. 16. పునుక, దాని వేడిమి.

వీనిని చక్కగా పరీక్షించక చేయు చికి త్సలు నిష్ఫలములు. "గోరక్షనాథ సిద్ధాంత పద్ధతి" యను గ్రంథములో వీని వివరణ చూడనగును.

ఈవిధముగా 72114 నాడులు, సిరలు, ధమనులు, 96 అస్థిసంధులు, 188 నాడీ గ్రంథులు, 6 కోశములు, 9 రంధ్రములు, 11 ఇంద్రియములు, 7 ధాతువులు, 4 అవ స్థలుగల మన శరీరములో ఏ భాగమునందు



ఏకపాద సర్వాంగాసనం

పార్శ్వవాయువు తగిలినదో పరిశీలించవలసి యుండును.

ఆ 72114 నాడులలో ప్రధానమైన 13 నాడులు, వాని వ్యాప్తి, వానిలో ప్రాణాది 10 వాయువుల గతులు, వాని పనులు, వాని హెచ్చుతగ్గులచేత నే పార్శ్వ వాయువు సంభవించును. పరిశీలించవలసిన విధాన మీ క్రింద ఇవ్వబడినది.

నాడులనుబట్టి:—

1. మూలాధారము మొదలు బ్రహ్మ రంధ్రము (పునుక) వరకు వెన్నెముక నడుమ వ్యాపించియుండు "సుషుమ్నా" నాడి చుట్టు ప్రక్కల రక్తసంచార వాయుగతులు వక్రిం



ఏకపాదోర్ధ్వ మయూరాసనం

బినచో నడుమునకు పార్శ్వవాయువు సంభవించును.

2. "పింగళ" నాడివద్ద వక్రించినచో కుడిపార్శ్వమునకు పక్షవాతము సంభవించును.

3. "ఇడా" నాడివద్దనైనచో ఎడమభాగమునకు

4. యశస్వినిలోనైనచో ఎడమకాలుకు

5. 'పూషా'లోనైనచో ఎడమకంటికి

6. పయస్వినిలోనైనచో కుడిచెవికి

7. 'సరస్వతి'లోనైనచో నోటికీ నాలుకకు

8. హస్తిజిహ్వాలోనైనచో కుడికాలుకు

9. శంఖినిలోనైనచో ఎడమచెవికి

10. గాంధారిలోనైనచో కుడికన్నుకు

11. విశ్వోదరలోనైనచో యోని గుద లింగములకు

పార్శ్వవాయువు వచ్చును.

ప్రాణాదివాయువుల గతినిబట్టి:—

1. ప్రాణవాయువు గమనము తగ్గినచో నోరు, బొడ్డు, హృదయములకు

2. అపానవాయువు మందగతినున్నచో నాభి మొదలు క్రిందనుండు అన్ని సంధులకు

3. వ్యానగమనము మందగనున్నచో చెవులు, కండ్లు కనుబొమ్మలనడుమ, భుజములు, మడమలు, గొంతులకు

4. ఉదానవాయువు గతి మందగించినచో కంఠకూపమునకు

5. సమానము మందగించినచో ఎచ్చటనైననూ

పార్శ్వవాయువు సంభవించును.

6, 7, 8. నాగ, కూర్మ, కృకర వాయువుల మందగతివలన చర్మమునకు, ఎముకలు, నాడీ గ్రంధి మూలములకు, ఇంద్రియ మూలములకు పక్షవాతము వచ్చును. కుష్ఠరోగము కూడ వచ్చును.



జఠర పరివృత్తి

9. దేవదత్తము మందగించుటవలన నిద్ర రాదు. మాటలు అస్ఫుటమగును.

10. ధనంజయము మందగించినచో శరీరము స్వాధీనము తప్పి శవమువలె పడుండవలసి వచ్చును.

అనగా ఏ వాయువునకు ఏది స్థానము, దాని క్రియ ఏమి, ఏ నాడిలో ఎంత రక్తసంచార ముండవలెను మొదలగు విషయములు ముందుగా తెలిసియుండవలెను.

రక్తసంచారము తగ్గినప్పుడు బలము క్షీణించును. వాయుగతి మందగించినప్పుడు శరీరము గుడ్డపేలికవలె వివశమై ప్రేలాడును. ఈ రెండింటినీ కనిపెట్టి, రక్తసంచారము తక్కువైనచో యోగాంగాసనములచేతనో, వాయుగతి మందగించినచో ప్రాణాయామములను శక్త్యానుసారము చేయించవలెను. రెండవదానికి యోగాసనములుకూడా తగుమాత్ర మవసరము. రక్తసంచారము, వాయుగమనము రెండునూ తగ్గినవారిచేత యోగాసనములు, ప్రాణాయామములు సమానముగా చేయించుటవసరము.

పార్శ్వ వాయువు సంభవించినప్పుడు శరీరభాగములను కదల్పలేరు. కనుక ఓర్పుతో సాధన చేయించుట అవసరమగును. రోగులు చికిత్సకులు విధించు నియమములకు బద్ధులై యుండవలెను. ప్రారంభదశలో ప్రాణాయామము చేయునప్పుడు కుంభకము (ఊపిరి బిగబట్టుట) 5 సెకండ్లకు మించరాదు. క్రమక్రమముగా హెచ్చించవలెను.

ఇటువంటి రోగములు సంభవించినప్పుడు సుదీర్ఘ కాలము చికిత్స బొందినవారే ఆరోగ్యవంతులగుదురు. అట్లని పాతంజల



ఉత్థాన మయూరాసనం





జఠర పరివృత్తి

# ★ యోగాసనములు - దేహారోగ్యము ★

కర్మనములో చెప్పబడినది. నా అనుభవము కూడ అట్లు నిరూపించుచున్నది. కొందరు పడినచో లాభ మెంతమాత్ర ముండదు. కొందరపాటువలన నేకదా మన శాస్త్రములనూ, దేశీయ చికిత్సావిధానములనూ పోగొట్టుకొంటిమి!

పార్శ్వవాయువువలన బాధపడుచున్న వారు శీఘ్రముగా జీర్ణమగు ఆహారము నే భుజించుట ముఖ్యము. గురువుల నాశ్రయించి ఈ క్రింది సాధనలను చేయవలెను.

1. జఠరపరివృత్తి (చిత్రములలో చూపినట్లు 3 విధములు సాధించవలెను)— 5 నిమిషములు.

2 సుప్తపాదాంగుష్ఠాసనము మూడు విధములు (5 నిమిషములు చొప్పున) 5 నిమిషములు

3. సాలంబ సర్వాంగాసనము - ఏకపాద, ద్విపాదములతో 5 నిమిషములు

4. ఉత్తానమయూరము ఏకపాద, ద్విపాదములతో 5 నిమిషములు

5. ఉజ్జాయీ, నాడీశోధక ప్రాణాయామములు 15 నిమిషములు

ఇట్లు మూడుమాసములు చేసినచో సామాన్యముగా ఆరోగ్యముకలుగును. మూడుమాసములకు లోపునే గుణము కనపడినను అది వ్యర్థమేనని మరువకూడదు.

మూడుమాసముల అనంతరము రెండు పూటలూ ఈ క్రింది సాధనలు చేయవలెను.

1. శలభాసనము - ఏకపాద ద్విపాదములతో - 5 నిమిషములు

2. మహాముద్ర - ఇరుప్రక్కలనూ 3 నిమిషములు.

3. పశ్చిమతాన, పూర్వతానాసనములు- 5 నిమిషములు

4. బద్ధకోణ, పర్వతాసనములు - 5 నిమిషములు.

రోగిని మెత్తని పడకపైన వెల్లకిల పండుకొనబెట్టి, జోడించి చక్కగా చాచిన కాళ్ళను మరొకరు పట్టుకొని అర్ధచంద్రాకారమువలె రెండుప్రక్కలకూ మూడుసార్లు త్రిప్పి, అటుతరువాత జఠర పరివృత్తి మొదలు క్రమముగా పైన చెప్పబడిన ఆసనములను అభ్యాసము చేయించవలెను. చేతులనుకూడా అదేరీతిగా త్రిప్పించవలెను. అయితే ఎక్కువ ప్రయాస పెట్టకూడదు. ప్రతి 5 నిమిషములకు 2 నిమిషములు విశ్రాంతి యొసంగవలెను. ఒకటి స్వాధీనమైనతరువాత మరొకటిగా పైన వివరించబడిన క్రమపద్ధతినే యనుసరించవలెనుగాని ఎవరియిష్టము వచ్చినట్లు వారు చేయరాదు. ఇట్లు చేసినచో తప్పక గుణము కలుగును. ఈ పార్శ్వవాయు రోగమునకు ఔషధపానాదులవలన రవంత ప్రయోజనముండదని చెప్పినందుకు నన్ను మన్నించ గోరుచున్నాను.

"పతివ్రతా దవనితా బ్రహ్మచారీ ద
పూరుషః కురుతః పావనం లోకత్రయం
వస్తు ద్వయం సదా॥"

అనగా పతివ్రతయైన స్త్రీ, ఇంద్రియములను జయించిన పురుషుడు వీరిరువురే లోకమును పావనము చేయుచున్నారని యర్థము.

[సశేషము]



జఠర పరివృత్తి

Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 4, Thambu Chetty St, Madras

పంచతంత్రం

# సంధి-విగ్రహం

కర్త... విశ్వాత్ముల నరసింహమూర్తి

అరుణముఖుని మాటలు విని మహాబలుడు యోచించి, కార్య సాఫల్యమును గూర్చి సంతసించి సమ్మతించె.

ఇది యిట్లుండగ చిత్రవర్ణుడూ దూరదర్శితో ఆలోచించి ఉచితరీతిని హిరణ్యగర్భునికి స్నేహపూర్వకముగా లేఖవ్రాసెను.

మహాబలుని సమ్మతిని కొని తెచ్చిన అరుణముఖుడే ఇందుకు సమర్థుడని తలచి దూరదర్శి ఆ లేఖను అరుణముఖుని చేతికిచ్చి హిరణ్యగర్భుని కడకు పంపె.

అరుణముఖుడు బయలు దేరి-రాజధాని ప్రవేశించి-మంత్రివర్యు దర్శించి-తన కార్యము వివరించెను.

మంత్రిగారు సంతసించి-హిరణ్యగర్భు సన్నిధికే-అరుణముఖుని కొనిపోయెను.

"ప్రభూ! చిత్రవర్ణు దూత నేను: అరుణముఖుడు నా పేరు. తమరనుమతించినచో సందేశము వినిపించెద!"

"భయము లేదు అరుణముఖా! సందేశము వినిపింపుము.

"మీ మైత్రికోరి మా ప్రభువు రాయబార మంపినారు. నేడు మొదలు మీ రాజ్యము మీరే పరిపాలించవచ్చు! ఇదిగో మా మహారాజు మీకిచ్చిన ఉత్తరము."

లేఖను చదివి హిరణ్యగర్భుడు మంత్రితో కలిసి ఆలోచించెను.

జవాబుగా ఒక లేఖవ్రాసి-ధవళాంగుని చేతికిచ్చి-'అరుణముఖునితో వెడలి- చిత్రవర్ణు దర్శించి- ప్రియోక్తుల నలరించి- లేఖనిచ్చి రమ్మ'నెను

రాయబారి అరుణముఖుని-ఉచితరీతి సత్కరించి-ధవళాంగుని జతచేర్చి సాగనంపివేశాడు

హాయిగాను పయనించిన అరుణముఖుడూ, ధవళాంగుడు చిత్రవర్ణు దర్శించి సందేశము వినిపించిరి.

సఫలీకృత మనోరథుడు-మహాబలుడు సైనికులను-తరలించుకు వెడలిపోయె.

"ఆవేశాలకు లోనైనట్టి- చిత్రవర్ణ హిరణ్యగర్భులు-విగ్రహమునకూ పాల్పడినారు.- మంత్రివర్యులా ఆలోచనతో- సంధి చేసుకుని స్నేహితులైరి.- ఇందలి నీతినె సంధి-విగ్రహమను-తంత్రముగా తెలుసుకోనండి."

"ధన్యులమైతిమి గురువర్యా!- తెలుసుకొంటిమి రాజ్యతంత్రము!"-

## సిద్ధముగానున్నది.



# మనిషిలో మనిషి

DR. JEKYLL AND MR. HYDE

**R.L. STEVENSON**



మూలం:

రాబర్ట్ లూయీ స్టీవెన్సన్

★

అనువాదం:

దాసు వామనరావు

★

డాక్టర్ జెకిల్ ఎండ్ మిస్టర్ హైడ్ (**Dr Jekyl And Mr Hyde**)
"మనిషిలో మనిషి" గ్రంథరూపంలో వెలువడినది
ప్రతులు కావలసినవారు తెప్పించుకొనుడు.

★

ప్రతి వెల రూ. **1-4-0**

---

## ఆంధ్ర గ్రంథమాల

తంబుచెట్టి వీధి, :: మద్రాసు 1.